# మామ్మో లీన

## మరియా మోంటెస్సోరి యొక్క కథ

**రచన:  బార్బరా ఓ' కొన్నోర్**

**చిత్రాలు:   సారా కాంపిటెల్లి**

**అనువాదం: రోహిణి చింతా**



# మామ్మో లీన
## మరియా మోంటెస్సోరి యొక్క కథ

రచన: బార్బరా ఓ' కొన్నోర్

చిత్రాలు : సారా కాంపిటెల్లి

అనువాద: రోహిణి చింతా

ముందుమాట:
మార్గరెట్ ఆర్. వాల్టుక్

అసోసియేషన్ మోంటెస్సోరి ఇంటర్నేషనల్

# మామ్మో లీన

## మరియా మోంటెస్సోరి యొక్క కథ

యువ మరియా మోంటెస్సోరికి ఉపాధ్యాయురాలు కావ్వాలన్న ఆశయం ఎన్నటికీ లేదు. మరియా పాఠశాల చాలా బోరుగా ఉంటుందని అనుకుని, చదువుమాని ఒక నటి కావడం కూడా పరిగణించింది. అదృష్టవశాత్తు, తను ఆలా చెయ్యలేదు.

దానికి బదులుగా, మరియా పాఠశాలలో ఉండి, తన తండ్రినినీ, సమాజాన్ని రెండిటినీ అంచనాని ధిక్కరించి, పిల్లల వైద్యురాలు - ఇంకా ఇటలీలోని మొట్టమొదటి లేడీ డాక్టర్ అయ్యింది.

త్వరలో, పిల్లల పట్ల ఆసక్తి డా.మోంటెస్సోరిని తనకు ఎన్నటికీ వద్దనుకున్న ఒక వృత్తి వైపు నడిపించింది - బోధన. తన ఆలోచనలు విద్యావిధానంలోనే మార్పుతెచ్చాయి, ఇంకా తన వారసత్వం ప్రపంచమంతటా తన పేరుతో ఉన్న పాఠశాలల్లో కొనసాగుతోంది

బార్బరా ఓ' కన్నోర్ యొక్క జీవం ఉట్టిపడే వచనం, ప్రేరణకలిగించే అసాధారణమైన, నూతన విద్య యొక్క 'మామ్మో లీనా' కథను వివరిస్తుంది.

# విషయ సూచిక

# ముందుమాట

మోంటెస్సోరి స్కూల్లో విద్యార్థి గానో లేదా ఆసక్తి ఉన్న ఒక వ్యక్తి గానో, మీరు మరియా మోంటెస్సోరి ఎవరా అని అనుకుని ఉండవచ్చు. మరియా మోంటెస్సోరి తన జీవితాన్ని పిల్లలందరి పురోగమనానికి అంకితం చేసింది. ఈ పుస్తకం, చిన్నతనం నుంచి యవ్వనవతిగా తాను ఇటలీలోని మొట్టమొదటి లేడీ డాక్టర్ కావడానికి పడ్డ శ్రమ, చేసిన పోరాటం దాకా, ఇంకా విద్యలో ప్రపంచ ప్రఖ్యాతి ఉన్న వ్యక్తిగా గడిపిన సంవత్సరాలదాక, మరియు తను ప్రపంచ శాంతి వాది అయిన దాకా, ఆమె జీవిత గమనం యొక్క జాడ చూపిస్తుంది. ఇంకా ఇది మరియా మోంటెస్సోరి సైజం అయినా స్వతంత్ర, ఊహాత్మకత, కీలక స్వభావాన్ని చిత్రీకరిస్తుంది.

నాకు మరియా మోంటెస్సోరితో లారెన్ , హాలండ్ లో, తాను 'విశ్వ విద్య' యొక్క ప్రపంచ దృష్టికోణాన్ని అభివృద్ధి చేసే సమయంలో దెగ్గరగా పని చేసే మహత్తర భాగ్యం లభించింది. తను గాఢంగా 'ప్రపంచ బిడ్డ' అనే భావనను నమ్మింది - అందరు పిల్లలకు నేర్చుకోవడం అనేది సంపూర్ణ జీవిత అనుభవం అని, మరియు అన్ని దేశాల, సంప్రదాయాల పిల్లలు ప్రాధమికంగా ఒకటే విధంగా అభివృద్ధి చెందుతారని.

మరియా మోంటెస్సోరి నా జీవితాన్ని మరియు మిగతా వారి జీవితాన్ని, తన హాస్యంతో, తెలివితేటలతో ఇంకా అంతులేని శక్తితో ఎంతో గొప్పగా ప్రభావితం చేసింది. ఆమె కథ, మనమందరమూ మనుషులలోను, ప్రపంచంలోనూ శాంతిని నెలకొల్పడానికి ఒక్కటవటానికి మీకు స్ఫూర్తిని ఇస్తుందని ఆశిస్తున్నాను.

మార్గరెట్ ఆర్. వాల్టుక్

అసోసియేషన్ మోంటెస్సోరి ఇంటెర్నేషనేల్

యునైటెడ్ నేషన్స్ యొక్క ప్రతినిధి.

# 1
# పాఠశాల రోజులు

రోమ్ , ఇటలీలో ఒక చీకటి రద్దీ తరగతి గదిలో కొంత మంది అమ్మాయిలు, పొడవాటి బెంచీల మీద నిటారుగా కూర్చుని, దించిన తల ఎత్తకుండా, మౌనంగా కుట్టుకుంటున్నారు. వారి లంగాలు కాళ్ళ మీద చక్కగా సవరించబడి ఉన్నాయి. ఆ అమ్మాయిలలో ఒకరు మరియా మోంటెస్సోరి.

మరియాకి కుట్లు కుట్టడం పెద్ద అభ్యంతరం అనిపించలేదు. అది పాఠాలు అప్ప చెప్పడం అంత బోరు కాదు. కనీసం కుట్లు కుట్టినంతసేపు తను చక్కటి ఆసక్తికరమైన విషయాలు గురించి ఆలోచించుకోవచ్చు. ఒక్కొక్కసారి మగ పిల్లల బడి ఎలా ఉంటుందా అని ఆలోచించేది. 1870లో మగపిల్లలూ, ఆడపిల్లలూ ఒకే తరగతి గదిలో కూర్చోవడం అనేది చాలా మందికి అభ్యంతరం కలిగించే విషయం. మరియా, ‘మగపిల్లలు కూడా వీరిలాగే గట్టి చెక్క బల్లల మీద కూర్చుంటారా?’ అనుకునేది. ‘వీరిలాగే బోరు కొట్టే పాఠాలు వల్లిస్తుంటారా? వారి టీచరు కూడా తరగతి గది ముందు నుంచుని అవే మాటలు పదేపదే చదువుతారా? మరియాకి ఒక్కటి మాత్రం ఖచ్చితంగా తెలుసు. మగపిల్లలు కుట్టు పనైతే చేయట్లేదు.

మరియా చిన్నపిల్లగా ఉన్నప్పుడు బడిలోని పని పట్ల సాధారణ ఆసక్తి కనబరిచేది. తనకు అన్ని సబ్జెక్టులలోనీ మంచి మార్కులు వచ్చినా, తను ఎంతో శ్రద్ధతో చేసే స్త్రీల పని (లావోరి డొన్నాషి) అయిన కుట్టు పనిలో వచ్చే మెప్పుతో, పురస్కారాలతో తృప్తి చెందేది. తన తోటి తొమ్మిదేళ్ల బాలికలలాగా తనూ ఒక నటిని కావాలనుకునేది. రోమ్ లో చాలా థియేటర్లు ఉన్న మీదట, నటనలో ఉద్యోగ అవకాశాలు ఎక్కువగా ఉంది ఉంటాయని మరియా అనుకునేది. ఒకవేళ తాను నటి కాకపోతే, టీచరు అవడం తప్ప ఆట్టే చేయడానికి ఏమి ఉండదని తనకి తెలుసు. కానీ టీచర్లు, కఠినంగా కనిపించే ఆసక్తి లేని పిల్లలకు కేవలం పాఠాలు చదివివినిపించే కఠినంగా కనిపించే ఆసక్తి లేని స్త్రీలు. ఊహు! తను ఎన్నటికీ టీచరు కాబోదు.

ఆటస్థలంలో మరియానే అందరికీ నాయకురాలు. తనకున్న గాంభీర్యం వల్ల తోటి పిల్లలు సహజంగా తన ఆదేశాలు పాటిస్తుండేవారు. అప్పుడప్పుడు తనతో ఆడపిల్లలు తను పొగరుగా పెత్తనం చలాయిస్తోందని అనుకునేవారు. కానీ మరియా అవేమీ గమనించలేదు. గమనించినా పట్టించుకోలేదు. తను సంతోషంగల, ఆత్మవిశ్వాసం గల పిల్ల.

1870లో మరియా పుట్టినప్పట్నుంచీ, మరియా తల్లి అయినా రెనిల్దే మోంటెస్సోరి, తను పెరిగిన సమయంలో అమ్మాయిలు చేయతగినవికాని పనులన్నీ, తన కూతురు చేస్తుందని ఆశపడేది.

రెనిల్డే చక్కగా చదువుకున్న తెలివైన స్త్రీ. తన కూతుర్ని చేయడానికి, ప్రశ్నలు అడిగి తెలుసుకోవడానికి, ఇంకా కష్టపడి అధ్యయనం చేయడానికి ఎంతో ప్రోత్సహించేది. ఆమె ఆడపిల్లలకి మంచి శిక్షణ (చదువు) అవసరమని భావించేది. తల్లి ప్రభావంతో మరియా చదువును మరింత ఆస్వాదించసాగింది.

మరియా లెక్కలు (గణిత శాస్త్రం) పట్ల ప్రత్యేక ఆసక్తి చూపించడం చూసి రెనిల్డే మురిసిపోయింది. బహుశా అంకెలతో పనిచేయగల ప్రతిభ మరియాకి తండ్రి నుంచి సంక్రమించి ఉంటుంది. మరియా తండ్రి అలెస్సాంన్డ్రో ఒక అకౌంటెంట్. మరియాకి బొమ్మలతో ఆడుకున్నంత సరదా లెక్కల పుస్తకం చదవటం అంటే. ఒకసారైతే తన లెక్కల పుస్తకాన్ని థియేటర్ కి తీసుకు వెళ్లి నాటక ప్రదర్శన జరుగుతుండగా చదివింది!

పన్నెండేళ్లు వచ్చేసరికి మరియా తన భవిష్యత్తు గురించి పదేపదే/ ఎంతగానో ఆలోచిస్తూ ఉండేది. త్వరలో ప్రాథమిక పాఠశాలలో తన చదువు ముగుస్తుంది. 1800లలో ఇటలీలోని చాలా మంది ఆడపిల్లలు ప్రాథమిక పాఠశాల చదువులకే పరిమితం అయ్యేవారు. కానీ మరియా నటి కావడానికి చదువు మానెయ్యడం తనకు ఇష్టం లేదని గుర్తించింది. దానికి బదులు చదువు కొనసాగించాలని కోరుకుంది. అది అసాధ్యం కాదని తనకి తెలుసు. కొంతమంది ఆడపిల్లలు మాధ్యమిక/ఉన్నత పాఠశాలకి వెళ్లేవారు. కానీ ఒక్కటే చిక్కు. వారిలో చాలా మంది శాస్త్రీయ కళాశాలలో సాహిత్యం మరియు భాష చదివేవారు.

మరియాకి గ్రీకు, లాటిన్ పట్ల ఆసక్తి లేదు. సాంకేతిక పాఠశాలలో బోధించే లెక్కల (గణిత శాస్త్రం) పట్ల ఆసక్తి ఉంది. చాలా తక్కువ మంది ఆడపిల్లలు సాంకేతిక పాఠశాలకు వెళ్లేవారు. కానీ మరియాని ఆ విషయం అంతగా ఇబ్బంది పెట్టలేదు. తను గణితం చదువుకోనడానికి నిశ్చయించుకుంది. తన నిశ్చయానికి తనే మురిసిపోయింది. ఆమె తండ్రి మాత్రం మురవలేదు. సాంకేతిక పాఠశాల అబ్బాయిల కోసమని ఆమెకి చెప్పాడు. ఇక గణితమా! అసల అమ్మాయిలకి గణితం చదవాల్సిన అవసరం ఏమిటని?
ఆ ఆలోచనే భయంకరంగా ఉంది!

మరియా విషయాన్ని అంత సులువుగా వదిలేయలేదు. తండ్రికి నచ్చచెప్పడానికి ప్రయత్నించింది. దెబ్బలాడింది. వేడుకుంది. కానీ అలెస్సాంన్డ్రో వినలేదు. మరియా గుండె పగిలింది. తండ్రికి ఎందుకు అర్థం కావట్లేదు? అతని ఏకైక సంతానం అతనికి గణితం పట్ల ఉన్న ఆసక్తిని పంచుకోవడం సహజమేగా. కానీ అలెస్సాంన్డ్రో భావాలు పాతవి. మార్పును స్వాగతించే మనిషి కడతాను. యువతులకు తెలివి, సోయగం/వయ్యారం అవసరం కానీ, గణితం కాదని అనుకునేవాడు. ఇటలీ సమాజం అతనితో ఏకీభవించేది.

అదృష్టవశాత్తూ, మరియా సాంకేతిక పాఠశాలకువెళ్లాలన్న నిశ్చయానికి రెనిల్డే ఏమాత్రం సందేహించకుండా మద్దతిచ్చింది.

బహుశా ఆమె, చిన్నతనంలో ఎల్లప్పుడూ తను అవ్వాలన్న సాహసోపేతమైన యువతిని మరియాలో చూసింది. తన కూతురు కొద్దిపాటి తిరుబాటుదారిణి కావడం రెనిల్డేకి మహా ముద్దు కలిగించింది. మొండిఘట్టాలైన భార్య బిడ్డలతో అలెస్సాండ్రో సరితూగలేకపోయాడు. ముభావంగా ఒప్పుకున్నాడు.

మరియా సాంకేతిక కళాశాల ప్రవేశం 1883లో తన పదమూడవ పుట్టినరోజు తర్వాత వచ్చే శరదృతువులో. ఆ వేసవి కాలం క్షణమొకయుగంలా గడిచింది. మరియా చదువుకుంటూ, కుట్లు కుట్టుకుంటూ సమయం గడిపింది. కానీ చాలా మటుకు ‘పాఠశాల ఎలా ఉంటుందా?’ అన్న ఆలోచనలలో గడిపింది.

మరియాకి అబ్బాయిలతో పాఠశాలకి వెళ్లడం, అమ్మాయిలతో పాఠశాలకు వెళ్లడం కంటే ఆసక్తికర విషయం కాదని తెలుసుకోవడానికి ఆట్టే సమయం పట్టలేదు. ఆమెకు, చరిత్ర, ఖగోళశాస్త్రం నేర్చుకోవడం ఆనందం కలిగించాయి. ఆసక్తితో కాలిగ్రఫీ, ఇటాలియన్ లిటరేచర్ వంటి కొత్త సబ్జెక్టులు అభ్యసించింది. కానీ క్లాసులు మాత్రం ఎప్పుడూ ఒకలాగే ఉండేవి. విద్యార్థులందరూ గంటల తరబడి వారి డెస్క్ వద్ద కూర్చుని పాఠ్యపుస్తకాలలోని రూల్స్ బట్టి పడుతూ, మళ్లీమళ్లీ అదే వల్లెవేస్తూ ఉండేవారు. తనకు ఎంతో ప్రియమైన గణిత శాస్త్రం కూడా చాలా బోర్ గా అనిపించింది. అరె! తను కొన్ని ప్రశ్నలు అడిగే అవకాశం ఉన్నా, కొత్త ప్రయోగాలు చేయగలిగినా,కనీసం తర్వాత పాఠం చదవనిచ్చినా, ఈ నేర్చుకునే ప్రక్రియ ఎంతో ఆనందంగా ఉంది ఉండేది. ఏమైనా సరే మరియా పాఠశాలలోనుంచి ఉత్తీర్ణురాలు కావడానికి ధృడంగా నిశ్చయించుకుంది. అసల పాఠశాల మానెయ్యవచ్చన్న ఆలోచన కూడా పరిగణించలేదు.

సాంకేతిక పాఠశాలలో కొన్ని సంవత్సరాలు గడిచాక, మరియా ఇంజినీరు కావాలని నిశ్చయించుకుంది. తన తోటి విద్యార్థులలో చాలా మంది ఇంజినీర్లు కావాలని నిశ్చయించుకున్నా, మరియా ఈ విషయం తండ్రితో చెప్పడానికి భయ కంపితురాలయింది. అతని స్పందన ఎలా ఉంటుందో తాను ఊహించగలదు. “ఇంజినీరింగు అబ్బాయిలకి!” అంటాడు అతను. మరియా సరిగ్గా ఊహించింది.

అలెస్సాండ్రో కూతురి నిశ్చయానికి మతి చెదిరి, షాక్ అయ్యాడు. ఆమె మిగిలిన యువతుల్లా టీచర్ ఎందుకు కాదు?

కానీ 1890 వేసంకాలంలో తన సాంకేతిక కళాశాల నుంచి ఉతీర్ణురాలైన మరియా, మరోసారి తన వృత్తి గురించి తన మనస్సు మార్చుకుంది. తాను ఇక ఇంజినీరు కాదలచుకోలేదని తండ్రితో చెప్పింది. కానీ అలెస్సాండ్రో మనసు తేలిక పడే లోపే, మరియా మరో ప్రకటన చేసింది. ఇంజనీర్ కి బదులుగా మరియా ఇప్పుడు డాక్టర్ అవ్వాలని నిశ్చయించుకుంది!

# 2

# సింహాలను మచ్చిక చేసుకోవడం

“షాకింగ్! భయంకరం!”

“కనీవినీ రాగం!”

“లేడీ డాక్టరా? అసంభవం!”

మరియా ఇవే మాటలు తన కుటుంబ సభ్యుల నుంచి, తన స్నేహితుల నుంచి పదేపదే విన్నది. ఇటలీలో ఎన్నడూ ఏ స్త్రీ వైద్య కళాశాలకు వెళ్ళలేదు. ఏ స్త్రీ ఇటువంటి దారుణానికి వడిగట్టిన అలెస్సాండ్రో మోంటెస్సోరి తీవ్ర అసమ్మతి తెలిపి ఉండేవాడు. కానీ తన సొంత కూతురు ఆ పని చేస్తే? అతను మరియను వైద్యవిద్య అభ్యసించడం నుంచి నిర్దేశించబోడు అని ఆమెకు చెప్పాడు కానీ, అతను ఇది ఎన్నటికీ సమ్మతించబోడు.

మరోసారి రెనిల్డే కూతురి పక్షం వహించింది. మరియా తీసుకున్న సాహసవంతమైన నిర్ణయం పట్ల ఆమె ఎంతో సంతోషించింది. భర్త యొక్క కోపోద్రిక్తమైన తీవ్ర అసమ్మతి ఆమెను కించిత్తయినా బాధ పెట్టలేదు. మరియా చక్కని లేడీ డాక్టర్ అవుతుందని ఆమెకి తెలుసు.

సహజంగా ఉన్న ఆత్మవిశ్వాసంతో మరియా తన లక్ష్యాన్ని సాధించడానికి సిద్దమయింది. తన అసాధారణమైన వృత్తి ఎంపికకు సమ్మతి పొందగలనన్న ఆశతో మరియా రోమ్ విశ్వవిద్యాలయంలో వైద్య విభాగానికి ప్రధాన ఆచార్యులైన (హెడ్ ) డా. గ్విడో బాచెల్లి ను కలవడానికి వెళ్ళింది. అతనితో, తన అండర్ గ్రాడ్యుయేట్ డిగ్రీ పొందాక వైద్య కళాశాలలో చేరాలన్న తన ఆలోచన చెప్పి, అతని మద్దతు కోరింది. ఒక స్త్రీ వైద్య విద్య అభ్యసిస్తుందన్న ఆలోచన కూడా డా. బాచెల్లికి జుగుప్సాకరంగా తోచింది. అతను మరియాతో ఆమె ఆలోచన అసంభవమని, ఆమెకు ససేమిరా ఏ రకమైన మద్దతు ఇవ్వ నిరాకరించాడు.

మరియా ఏ మాత్రం ధైర్యం కోల్పోలేదు. తిరిగి వెళ్లిపోయేప్పుడు మరియా ఎంతో మర్యాదగా అతనికి షేక్ హ్యాండ్ ఇచ్చి, అతను తనకు సమయం కేటాయించినందుకు ధన్యవాదాలు తెలిపి, ఎంతో దృఢంగా ఇలా ప్రకటించింది “నేను డాక్టర్ అవగలనని నాకు తెలుసు”.

1890లో తన 20వ ఏట మరియా రోమ్ విశ్వవిద్యాలయంలో సైన్స్ మరియు గణితంలో తన అండర్ గ్రాడ్యుయేట్ అధ్యయనం మొదలు పెట్టింది. తనకు అన్ని తరగతులలోనూ ఉన్నతమైన శ్రేణులు వచ్చాయి. తాను 1892లో డిప్లొమా పట్టా అందుకుంది. తాను వైద్య కళాశాలకు దరఖాస్తు పెట్టడానికి సిద్ధమైంది. తనకు ఎదురైన అఖండ అసమ్మతిని పట్టించుకోకుండా

మరియా, తనను వైద్య కళాశాలలో చేర్చుకునేదాకా పట్టుదల కొనసాగించింది. తాను ఇది ఎలా సాధించిందో ఎవరికీ తెలియదు.

మరియా మోంటెస్సోరి ఇటలీ మొత్తానికి వైద్య విద్య అభ్యసించిన మొట్టమొదటి మహిళ. తాను జీవితంలోకెల్లా పెద్ద సవాలు తాను ఎదుర్కొంటుందని తనకి తెలుసు. నాలుగు సుదీర్ఘ సంవత్సరాలు ఆమె ముందున్నాయి. తాను సాధించగలదా? మరియా సాధించగలనని నమ్మింది.

ఇతర విశ్వవిద్యాలయ విద్యార్థుల లాగా మరియా తన ఇంట్లోనే, తన తల్లితండ్రులతో ఉండేది. రోజులో ప్రతిక్షణం, రాత్రి చాలా భాగం మరియా తన చదువుకే అంకితం చేసింది. తన తోటి వయసు యువతులు కుట్లు కొట్టుకుంటూ, పియానో సాధన చేస్తూ, యువకులచే ఆరాధింపబడుతుండగా, మరియా ఫిజిక్స్, కెమిస్ట్రీ మరియు బోటనీ అధ్యయనం చేస్తూ ఉండేది. తాను ఎన్నడూ ఒక్క ఉపన్యాసం/పాఠం కూడా మిస్ కాలేదు. ఒక చలి కాలం, పెద్ద మంచు తుఫాను వచ్చినప్పుడు, మరియా ఆ లోతైన మంచులో, తన పొడవాటి లంగాలో కష్టం మీద నడుస్తూ పాఠం వినడానికి వెళ్ళింది. తడితో ముద్దయిపోయి, పళ్ళు వణికించే చలిలో తాను తరగతి చేరింది. తీరా చూస్తే తాను ఒక్కత్తే వచ్చింది. ఉపన్యాసం ఇవ్వటానికి వచ్చిన అధ్యాపకుడు, పాఠం వినాలన్న మరియా పట్టుదల చూసి ముగ్ధుడై, ఆమె ఒక్కతికే ఉపన్యాసం ఇచ్చేసాడు.

మరియా విశ్వవిద్యాలయంలో తన అధ్యాపకుల మన్నన తొందరగానే పొందింది కానీ, ఇతర విద్యార్థుల మన్నన పొందడం చాలా కష్టం అయింది. మరిదికి ఒక్కరోజు కూడా తనని తన తోటి విద్యార్థుల నుంచి భిన్నంగా ఉంచే విషయం గుర్తు తేకుండా గడిచేది కాదు - మరియా ఒక స్త్రీ!

తాను డాక్టర్ అవడానికి చదువుతూ ఉండవచ్చు కానీ, పంతొమ్మిదవ శతాబ్దంలో ఉండే సాంఘిక ఆచారాలు తాను పాటించాలని భావన ఉండేది. అప్పట్లో యువతులు బయటకు ఒక్కరూ వెళ్లడం సరైన పద్ధతి కాదు కనక, మరియా పాఠశాలకు వెళ్లడానికీ, రావడానికీ, అసమ్మతి చూపించే తన తండ్రి తోడు రావలసి వచ్చేది. పాఠశాల లోపలికి వెళ్ళాక,ఆఖరి విద్యార్థి తరగతి గదిలో ప్రవేశించి, కూర్చున్నాక గానీ మరియాకి లోపలికి ప్రవేశం ఉండేది కాదు. ఒక స్త్రీ కారిడార్లలో పురుషులకి దగ్గరగా సంచరించడం ఎంతో సిగ్గుచేటు అయి ఉండేది.

కొన్నిసార్లు ఇతర విద్యార్థులు మరియా తరగతి గదిలోకి వచ్చేసరికి, తనకి కూర్చోవడానికి చోటు లేకుండేటట్టు ఏర్పాటు చేసేవారు. అప్పుడు మరియా రెండు గంటలు తరగతి గది వెనక నుంచుని పాఠాలు వినాల్సి వచ్చేది. వాళ్లు వాళ్ల పరస్పర పరిహాసానికి సంతోషిస్తూ విసిరే వెటకారాలు మరియా వింటుండేది. వారిని, తనను నిరుత్సాహపరచడంలో ఆనందం పొందనివ్వకూడదని మరియా ధృడంగా నిశ్చయించుకుంది. మరియా వారి పట్ల ఓపికతో, కొన్నిసార్లు చక్కటి చతురోక్తులతో, ఒక్కొక్కసారి తీవ్రమైన చూపులతో ప్రతిస్పందించేది. ఒకసారి, వెనక కూర్చున్న విద్యార్థి అదే పనిగా మరియా కూర్చున్న కుర్చీ వెనక భాగాన్ని తన్నుతుంటే, మరియా అతన్ని చూసిన చూపుకు అతను, తరవాత అతని స్నేహితులతో “నేను చిరంజీవిని అయి ఉంటాను, లేకపోతే ఆ చూపుకు నేను చచ్చిపోయి ఉండేవాణ్ణి” అని చెప్పాడు.

మరియా మోంటెస్సోరి లక్ష్యం ఒక్కటే - ఆమె డాక్టర్ కావాలి. తాను కళాశాలలో నిండివుండిన పురుషులను తన ఆశయాలకు అడ్డు రానివ్వబోదు.

తనకు ఆంక్షలు ఉన్నప్పటికీ, మరియా చాలా సమయం ఆనందంగానే ఉండేది. కానీ, అక్కడక్కడ తను అధైర్య పడ్డ సమయాలు కూడా ఉన్నాయి. తన తండ్రి ముభావంగా, తనలో తానుగా ఉంటూ వచ్చాడు. తోటి విద్యార్థులు తనను తప్పించుకు తిరిగేవారు. వేళాకోళం చేసేవారు.

ఇదేకాక, వైద్య విద్యార్థులు అవసరంగా మనుషుల శవాల శరీరాలు కోసి (డిసెక్షన్), చదవవలసిన అనాటమీ క్లాస్ ఒక కఠిన పరీక్షలా తయారయింది. మరియా శవాలను కోసి, వాటి లోపల అవయవాలు తాకడం అస్సల ఇష్టపడేది కాదు. ఇది చాలదన్నట్టు, మరియా రాత్రిపూట ఒంటరిగా ఈ డిసెక్షన్ చేయాల్సి వచ్చేది. పురుషుల సావాసంలో నుంచుని శరీరాన్ని గురించి అభ్యసించడం సరైన పద్ధతి అయి ఉండేది కాదు.

మరియా ఎప్పటికీ తను అనాటమీ ఇన్స్టిట్యూట్లో గడిపిన మొదటి రాత్రి మరువ బోదు. తాను ఆ గదిలో నుంచి పారి పోకుండా ఉండటానికి తన మనోధైర్యమంతా కావలసి వచ్చింది. బీరువాలో నేరస్థుల అవయవాలు ఉన్నాయి - ఒక సీసాలో వారి ప్రేగులు, మరో సీసాలో వారి మెదళ్లు. వారి కాపాలాలు ‘హంతకుడు’, ‘దొంగ’ అని నల్లని సిరాతో రాసిన చీటీలు పెట్టి, చక్కటి వరుస క్రమంలో అమర్చబడి ఉన్నాయి. ఒక బేసిన్లో, ఇంకా లేత గులాబీ రంగు కండ ప్రేలాడుతున్న ఎముకలు ఉన్నాయి. గదిలో ఒక మూల పెద్ద అస్తిపంజరం నిలబెట్టి ఉంది. “నేను దాన్ని తేరి చూస్తున్నంతలో అది కదలినట్టనిపించింది” అని మరియా తన స్నేహితురాలికి రాసింది. “నేను నా కళ్ళు మరొక వైపుకు తిప్పి, నేను చూసిన వాటన్నిటికీ దూరంగా వెళ్లి పోవాలన్న భావనతో అటూ ఇటూ తిరగనారంభించాను.

ఆ డిసెక్షన్ గదిలో రసాయనాల యొక్క భయంకరమైన వాసనకి మరియాకి జబ్బు చేసినట్టయింది. ఒక సారి ఒక యువకుడికి తన పక్కన నుంచుని సిగరెట్ కాల్చడానికి డబ్బు ఇచ్చింది. ఏదో విధంగా శవాల నుంచి వచ్చే భయంకర దుర్గంధం తప్పించుకోవడానికి తానే సిగరెట్ కాల్చే ప్రయత్నం కూడా చేసింది.

మరియా వైద్య కళాశాల ఎంపిక చేసుకుని తప్పు చేసానా అని అనుకోనారంభించింది. తాను ఎన్ని అవరోధాలు ఎదుర్కొన్నదంటే, దీనంతటివల్లా ప్రయోజనం ఏమిటీ అని ఆలోచించేది. మానివేయడం ఎంతో సులువుగా ఉండి ఉండేది. కానీ మరియా అంత తేలికగా వదిలేసే రకం కాదు. తన సంశయాలను తోసిపుచ్చి, రెట్టించిన ఉత్సాహంతో ముందుకు సాగింది. ఏళ్ల తరవాత “ఆ రోజుల్లో నేను ఏమైనా చేయగలనని నాకు అనిపించేది” అని తాను ఒక స్నేహితురాలికి చెప్పింది.

తాను కళాశాలలోని చివరి రెండేళ్ళలో, పిల్లల వైద్యం (పీడియాట్రిక్స్) ను అభ్యసించింది. తాను రోమ్ లో ఒక పిల్లల వైద్యశాలలో పనిచేసి, ఆచరణాత్మక జ్ఞానం (ప్రాక్టికల్ ఎక్స్పీరియన్స్) సంపాదించింది. తనకు ఆ పని ఎంతో ఇష్టం అయ్యింది. తాను వేగంగా పిల్లల వ్యాధులలో గొప్ప నిపుణురాలయిపోతోంది. తాను మానసిక రోగాలు (సైకియాట్రీ) లో ప్రత్యేక ఆసక్తి తీసుకుని, విశ్వవిద్యాలయ మానసిక ఆస్పత్రిలో వాటికి సంబంధించిన పరిశోధనలు చేసింది. విశ్వవిద్యాలయంలో ఆరు సుదీర్ఘ సంవత్సరాల తరువాత 1896లో మరియా మొత్తానికి తన చదువు ముగించే అంకం చేరుకుంది. అప్పట్లో అందరి వైద్య విద్యార్థుల లాగా తను కూడా తన పై తరగతి మొత్తానికి ఒక ఉపన్యాసం ఇవ్వాల్సిన అవసరం ఉంది.

తాను స్టేజి పైకి వెళ్లి, సభ అంతా నిండి ఉన్న మగవారిని చూసింది. తనను ఎత్తిచూపడానికి (క్రిటిసైజ్) చెయ్యడానికి వారిలో చాలా మంది సిద్ధంగా ఉన్నారని తనకి తెలుసు. వారు అరచి గోల పెడతారేమో అని కూడా తాను భయపడింది. కానీ తాను ఉపన్యాసం ముగించాక, సభలో నిండిన కరతాళధ్వనులతో తను ఆశ్చర్యపోయింది. తన తోటి విద్యార్థులంతా లేచి నిలబడి “చక్కటి ఉపన్యాసం, అద్భుతం (బ్రావ!’ అని ‘శభాష్ (బెనీ!)’ అని అరిచారు.

కన్నీరు నిండిన కళ్ళతో, మరియా, అందరికంటే విడిగా/దూరంగా నుంచుని ఉన్న ఒక ఆకారాన్ని చూసింది. అన్నిటికంటే చివరి పంక్తిలో తన తండ్రి నుంచున్నాడు. అతను చప్పట్లు కొడుతున్నాడు! అతను నవ్వుతున్నాడు! చివరికి అతను ఆమెను అంగీకరించాడు! మరియా ఈ రోజు ఎన్నటికీ మరువ బోదు. “నేను సింహాన్ని అదుపులో పెట్టగల మనిషిలా ఆ రోజు నాకు అనిపించింది” అని ఆమె తర్వాత జ్ఞాపకం చేసుకోబోతుంది.

జులై 10, 1896లో, 25 సంవత్సరాల వయసులో మరియా తన వైద్య పట్టానూ, డాటరేస్సా (లేడీ డాక్టర్) అన్న బిరుదును సంపాదించింది! తాను సాధించింది! తాను ఇటలీలోనే మొట్టమొదటి లేడీ డాక్టర్!

# 3

# కొత్త దిశ

మరియా విశ్వవిద్యాలయ జీవితాన్ని వదిలి, నిజమైన వైద్య వృత్తిని అవలంబించడానికి ఆత్రుత పడింది. తాను ఇక సమయం వృధా చెయ్యలేదు. తనకు పట్టా అందిన నాలుగు నెలలకు యువ డాటరేస్సా మోంటెస్సోరికి మూడు ఉద్యోగాలు ఉన్నాయి! రెండు ఆస్పత్రుల్లో అసిస్టెంట్ గా పని చేయడమే కాక, మరియా తన సొంత వైద్య కేంద్రం (క్లినిక్) తెరిచింది. మరియాకి గతంలో విద్య నేర్పిన విశ్వవిద్యాలయ ఉపాధ్యాయులు రోగులను, ముఖ్యంగా పిల్లలను తన దగ్గరకు పంపించడం మొదలు పెట్టారు. మరియాకి పిల్లల వైద్యం పట్ల ఆసక్తి ఉందని వారికి తెలుసు. అతి త్వరలో మరియా కొత్త ఆఫీసులోని ప్రతీక్ష గది రోగులతో నిండి పోయింది.

తరచూ మరియాకి దప్తరు వదిలి వ్యాధిగ్రస్తమైన పిల్లల ఇళ్ళకి వెళ్ళడానికి పిలుపులు వచ్చేవి. ఒక్కొక్కసారి ఆ చిన్నారి రోగుల వ్యాధి నిర్ధారణ చేసి వైద్యం అందించాక, మరియా వారి పడకగదిని శుభ్రం చేసి, దిండుని మెత్తని ఉన్నిలా వత్తి, ఒక గిన్నెడు వేడి సూప్ కూడా వండేది.

తన దగ్గర స్నేహితురాలు ఒక సారి “పనిమనిషి, వంట మనిషి, నర్సు మరియు డాక్టరు అన్నీ మరియానే” అని వర్ణించింది.

మరియా తన కొత్త వృత్తిలో ఎంతో సంతోషంగా ఉండేది. తాను వైద్య కళాశాల పట్టా అందుకున్న ఒక్క ఏడాదిలోనే, తన వృత్తి తనని ఒక కొత్త దారిలో నడిపిస్తుందని తాను ఎన్నటికీ ఊహించి ఉండేది కాదు. కానీ జరిగింది మాత్రం సరిగ్గా అదే!

తనకు తీరికలేనంత పని ఉన్నప్పటికీ, మరియా ఎలాగోలా రోమ్ విశ్వవిద్యాలయంలోని మానసిక వైద్య కేంద్రంలోని తన పరిశోధనలు కొనసాగించింది. 1897లో అసిస్టెంట్ డాక్టరుగా తాను వైద్య కేంద్రం ఉద్యోగులలో చేరింది. మరియా ఇంకొక ఉద్యోగం తీసుకోవడం ఎలా సాధ్యపడగలదు అని ఆశ్చర్యపడింది, కానీ, మానసిక వైద్య శాస్త్రం అంటే తనకి ఏంతో మక్కువ. ఎలాగోలా సమయం, ఓపికా కుదుర్చుకుంటుంది.

తన కొత్త ఉద్యోగంలో ఒక విధి, మానసిక రోగులు ఉండే శరణాలయాలకు వెళ్లడం. అక్కడ రోగులను గమనించి, వారిలో వైద్య కేంద్రంలో వైద్యం పొంద తగ్గ వారిగా తాను గుర్తించిన రోగులను ఎంపిక చేసేది. తాను పిల్లల పట్ల మొగ్గు చూపుతున్నట్టు మరియా కనుక్కొంది. ఆ పిల్లలలో కొంతమంది మానసిక ఎదుగుదల లేని వారు. మిగతా వారు మనోనిశ్చలత లేనివారు లేదా తీవ్రమైన ప్రవర్తన సమస్యలు ఉన్న వారు. శరణాలయాలలో, వారిని బంధీలలా చీకటి, ఖాళీ గదులలో ఉంచేవారు. వారికి ఆడుకోవటానికి ఏమీ ఉండేదికాదు. వారికి పడుకోవడం, తినడం తప్ప మరేమీ చేయడానికి లేదు.

మరియాకి ఆ పిల్లలను చూసి ఎంతో కష్టం కలిగింది. నిరంతరం వారి గురించే ఆలోచన. తప్పక వారికి సహాయం చేయడానికి ఏదో మార్గం ఉంటుంది. శరణాలయాలు దీనికి జవాబు కాదని తనకి తెలుసు.

ఒక శరణాలయ సందర్శన సమయంలో, పిల్లలు భోజనం అయిన తర్వాత నేల మీద పాకుతూ పడిపోయిన బ్రెడ్ ముక్కల కోసం వెతుకుతూ తిరుగుతారని మరియాకి చెప్పడం జరిగింది. మరియా వింది, కానీ, జవాబు చెప్పలేదు. తను పిల్లలను గమనించింది. తను గదిలోని బోసి గోడలను చూసింది. అకస్మాత్తుగా తనకి ఒక కొత్త ఆలోచన తట్టింది. బహుశా ఈ పిల్లలు కింద పడ్డ బ్రెడ్డు ముక్కల కోసం ఆకలి వల్ల వెదకట్లేదేమో. బహుశా వారికి ఏదైనా చూసి, తాకే అవసరం ఉందేమో. ఆ బ్రెడ్డు ముక్కలే వారికున్న ఏకైక ఆట వస్తువులు.

ఎక్కువ సమయం పిల్లలను గమనించిన కొద్దీ, మరియాకి వారికి సహాయం చేయవచ్చునన్న నమ్మకం పెరిగింది. అట్లయిన వారికి చేయడానికి ఏదైనా పని కల్పిస్తే? వారికి పట్టుకోవడానికి వస్తువులు, చూడడానికి రంగులు, స్పర్శించడానికి ఆకారాలు ఇస్తే వారు ఎలా స్పందిస్తారో?

మరియాకి సమస్యలు పరిష్కరించడం అంటే చాలా ఇష్టం. శరణాలయ పిల్లల సమస్య తీర్చాలని తను నిశ్చయించుకుంది. తను మానసిక వికాసం లోపించిన మరియు మనోనిశ్చలత లేని పిల్లలను గురించి తనకు దొరికిన దల్లా చదవడం మొదలు పెట్టింది. గతంలో వాడిన వ్యాధి నిరోధక పద్ధతులను గురించి చదివింది. మరియు పిల్లలను గమనించడం కొనసాగిస్తూ, తన పరిశీలనలూ, ఆలోచనలు గూర్చి చీటీలు రాసుకుంది.

తుదకు మరియా తన జీవిత గమనాన్ని ఎప్పటికీ మార్చెయ్యబోయే ఒక నిర్ణయానికి వచ్చింది. ఈ పిల్లలు చెందాల్సింది పాఠశాలల్లో, ఆస్పత్రులలో కాదు అని నిర్ణయించింది. ఈ పిల్లలు ప్రత్యేకమైన వారు కాబట్టి వారికి ప్రత్యేకమైన పాఠశాలలు అవసరం. మరియా చిన్న పిల్లల విద్యా విధానాల గురించి ఏమి నేర్చుకోగలదో అదంతా నేర్చుకోవాలని నిశ్చయించుకుంది. ఆ తర్వాత శరణాలయ పిల్లలకు సహాయం చేయగల విధానం గురించి ఆలోచిస్తుంది.

రోజంతా రోగులకు తన దప్తర్ లోను, ఆస్పత్రి లోను చికిత్స చేసిన తర్వాత, మరియా ప్రతి రాత్రి ఇంటికి చదువుకోవడానికి వెళ్ళేది. తను ఖచ్చితంగా సరైన మార్గంలో ఉన్నదని అనుకుంది. తుదకు తను ఒక ప్రణాళిక రూపొందించింది - ప్రత్యేక అవసరాలు ఉన్న చిన్నారులకు ఒక పాఠశాల ప్రణాళిక.

మరియా పాఠశాలలో తరగతి గది ముట్టుకునే, పట్టుకునే వస్తువులతో నిండి ఉండబోతుంది. చూడ చక్కగా, పరిమళం వెదజల్లే పూలతో నిండి ఉండే తోట ఉండబోతుంది. కసరత్తు గదిలో పిల్లలు పరుగులు తీస్తూ, పడి లేస్తూ ఉండబోతారు. ఇంకా, పిల్లలు అక్షరమాల కూడా నేర్చుకోబోతారు- పుస్తకాల్లో అక్షరాలు బట్టి పట్టి జ్ఞాపకం పెట్టుకుని కాదు; వాటిని స్పర్శిస్తూ, అక్షరాలను వేళ్ళతో అనుకరిస్తూ. పిల్లలు మొదట వారి ఇంద్రియ జ్ఞానం వాడి - చూడడం,అనుభవించడం, వినడం, వాసన పీల్చడం - ఈ విషయాలు నేర్చుకోవాలి కానీ, వారి మెదడుతో కాదని మరియా నమ్మింది.

కానీ మరియాకి కాగితంపై ఆలోచనలు సరిపోవని తెలుసు. తను ఎప్పటికైనా తన పాఠశాల కల నిజం కావడం చూడాలంటే, తను ఇతరులను తన ఆలోచన సరైనదని ఒప్పించాలి.

మరియా తర్వాత రెండు సంవత్సరాలు కేవలం ఆ పని చేస్తూ గడిపింది. తను డాక్టర్లతో, అధ్యాపకులతో, సంఘసేవకులతో మాట్లాడింది. తన ఆలోచనల గూర్చి చిన్న,చిన్న పుస్తకాలలో (మ్యాగజైన్స్), అధికార వైద్య పత్రికల్లో (మెడికల్ జర్నల్) రాసింది. తన పరిశోధనలను గురించి ఉపన్యాసాలు ఇచ్చింది- మొదట రోమ్ లో, తర్వాత ఇటలీ మొత్తం లో.

మరియా తెల్లవారిందెగ్గర్నుంచి రాత్రి పడుకునేదాకా పనిచేసేది. అంత కిక్కిరిసిపోయిన పని వల్ల తనకు సామాజిక జీవితం లేకపోయింది. తన ప్రియమిత్రులు తన సహ ఉద్యోగులే!

మరియాకు, మానసిక వైద్య కేంద్రంలో ఉండే మరో అసిస్టెంట్ డాక్టర్ డా. జిసిప్పి మోంటెస్సానో అంటే ప్రత్యేక అభిమానం. ఆ ఇద్దరు యువ డాక్టర్లకూ చాలా విషయాల్లో ఏకాభిప్రాయం ఉండడంవల్ల త్వరలోనే మంచి స్నేహితులయిపోయారు. మరియా జిసిప్పి లాంటి స్నేహితుడు దొరికినందుకు సంతోష పడింది. అతను ఆమెను అర్థం చేసుకుని, ఆమె కళలను పంచుకున్నాడు. ఆ ఇద్దరి స్నేహితులకీ ప్రేమలో పడటానికి ఎంతో కాలం పట్టలేదు.

1898 మార్చిలో మరియా జిసిప్పి కుమారుడకు జన్మనిచ్చింది. కానీ తానూ, జిసిప్పి పెళ్లి చేసుకోలేదు. ఈ రోజు దాకా ఎవరికి ’ ఎందువల్ల’ అనేది ఖచ్చితంగా తెలియదు.

మరియా తన కొడుకుకి మారియో మోంటెస్సోరి అని పేరు పెట్టింది. అతని పుట్టుక మరియా, జిసిప్పి వారి మిగతా జీవితమంతా మోయబోయే రహస్యం. కేవలం వారి తల్లిదండ్రులకు, దగ్గర స్నేహితులకూ మాత్రమే నిజం తెలుసు. అప్పట్లో పెళ్లి కాకుండా పిల్లలు కలగడం అనేది ఒక అప్రతిష్ట.

ఒకవేళ నిజం గనక తెలిసినట్లయితే, మరియా పడ్డ శ్రమంతా వృధా అయిపోయి, తన వృత్తి జీవితం నాశనం అయి ఉండేది.

బాధతో మరియా తన కొడుకును తన వద్ద ఉంచుకోలేదు అన్న నిజాన్ని అంగీకరించింది. అలా అని వాడిని మొత్తానికే వదులుకోలేదని కూడా తనకి తెలుసు. అంచేత, చిన్న మారియోను గ్రామీణ రోమ్ లో ఒక కుటుంబంతో నివసించడానికి పంపించేశారు.

తన దగ్గర పిల్లవాడిని ఉంచుకో లేకపోతే, కనీసం తనకి దగ్గరలోని ఉంచుకోవాలని మరియా నిశ్చయించుకుంది. అతని బాల్యం మొత్తంలో మారియోకి అతని అసలైన తల్లిని గురించి నిజం ఎన్నడూ చెప్పలేదు. అతనికి మరియా తనని చూడటానికి వచ్చే ఒక 'అందమైన స్త్రీ' గా మాత్రమే తెలుసు.

1898 శరదృతు వంతా మరియా ప్రత్యేక అవసరాలు ఉన్న పిల్లల బోధన గురించి ఉపన్యాసాలు ఇవ్వడం, ఉపన్యాసాలు (ఆర్టికల్స్) రాయడం కొనసాగించింది. జనవరి 1899లో ఇటలీ విద్యా మంత్రిత్వ శాఖ మరియాకు రోమ్ లో ఉన్న ఉపాధ్యాయ శిక్షణ పాఠశాల 'కాలేజియో రోమానో' లో ఉపన్యాస శీర్షిక ఇవ్వడానికి ఆహ్వానం పంపింది. ఆ ఆహ్వానం మరియాకు ఎంతో గొప్ప విషయం.

సహజంగా ఆమె తన పరిశోధనలను ఇటలీ యొక్క ముందుతరం ఉపాధ్యాయులతో చర్చించే అవకాశం వచ్చినందుకు చాలా ఉత్సాహం పడింది. కానీ, తనకి ఆ ఆహ్వానం గురించి సంతోషించడానికి మరొక కారణం కూడా ఉంది. విద్యాశాఖ మంత్రి డా. గ్విడో బాచెల్లి; ఏ వ్యక్తి అయితే ఎనిమిదేళ్ల క్రితం తాను వైద్య కళాశాలకు దరఖాస్తు పెట్టుకుంటానన్న తన నిర్ణయాన్ని చెప్పినప్పుడు సహాయం అందించడానికి నిరాకరించాడో, ఆ వ్యక్తి!

1900 వసంత ఋతువులో మరియాకు ఒక అద్భుతమైన వార్త అందింది. రోమ్ లో ఒక కొత్త పాఠశాల ప్రారంభం కాబోతోంది- మానసిక మరియు మనో రుగ్మత ఉన్న పిల్లలతో పనిచేయడానికి ఉపాధ్యాయులకు శిక్షణ ఇచ్చే ఒక పాఠశాల. ఆ ఉపాధ్యాయులు ఆ కొత్త పాఠశాలకు రాబోయే 22 మంది పిల్లలతో పని చేయబోతారు. మరియాని పాఠశాల నడపడానికి అవసరమైన ఇద్దరి నిర్దేశకులలో ఒకరిగా ఉండమన్నారు. మరొక నిర్దేశకునిగా జిసిప్పి మోంటెస్సానో ఉండబోతున్నాడు. మరియా పులకరించిపోయింది. ఇప్పుడు మరియాకి పిల్లలమీద తన ఆలోచనలు ప్రయోగించడానికి ఒక అవకాశం కలగబోతోంది. అంత పరిపూర్ణమైన ఉద్యోగం తన ఊహకు కూడా ఎప్పుడూ అందలేదు.

ఇంకా 30 ఏళ్ళు కూడా రాని మరియా, తన కొత్త ఉద్యోగంలోనూ ఎప్పట్లాగే ఉత్సాహంతో, నిశ్చయంతో పనిచేసింది. తన సహజ ఆసక్తి మరియు సవాళ్లను ఎదుర్కొనే నైజం, తనను బోధనలోకి నడిపించాయి - తాను ఏ వృత్తి అయితే ఎన్నటికీ చేయబోనని ఎప్పుడూ చెప్పేదో, సరిగ్గా అదే వృత్తిలోకి!

కానీ మరియా ఏమి సాధారణమైన ఉపాధ్యాయురాలు కాదు. తాను రోజంతా పిల్లలతోనే ఉండేది - వారికి పాఠాలు చెప్తూ, గమనిస్తూ, ప్రయోగాలు చేస్తూ. రాత్రిళ్ళు మరియా తను రోజంతా గమనించిన దానిని గురించి చీటీలు (నోట్స్) రాసుకునేది. తరవాత పాఠ్య సామగ్రి యొక్క బొమ్మలు గీసి, మోడళ్ళు చేసేది. ఏదైనా ఒక డిజైన్ బాగుంది అనుకున్నప్పుడు తను ఆ పరికరాలు ఉత్పత్తి చేయించేది. కొంత కాలంలోనే మరియా తరగతి గది పట్టుకునే ఆకారాలతో (షేప్స్), గుచ్చగల పూసలతో, కట్టే లేసులతో

నిండిపోయింది. అక్కడ జోడించడానికీ, సమూహాలుగా అమర్చడానికి వీలున్న రకరకాల కొలతలు ఉన్న వస్తువులు,రకరకాల రంగుల మరియు ఆకృతి ఉన్న వస్తువులు ఉండేవి.

చెక్కతో చేసిన త్రిమితీయ (త్రి డైమెన్షనల్) అక్షరమాల మరియా రూపకల్పనలలో ఒకటి. తను అచ్చులకు ఎర్ర రంగుతోనూ, హాల్లులకు నీలి రంగుతోనూ రంగులు దిద్దింది. తను ఆ అక్షరమాల అక్షరాలు పిల్లలకు ఇచ్చి, దూరంగా కూచుని వారిని గమనించేది. పిల్లలు అక్షరాలను మళ్లీమళ్లీ తాకుతుంటే, మరియా పరవశించింది.

ఇంతలో ఒక రోజు మరియా హృదయం ఆనందంతో ఉప్పొంగిపోయింది. పిల్లలు అక్షరాలను సుద్దముక్కతో బ్లాక్ బోర్డుపై రాయడం మొదలు పెట్టారు. సహజంగా విడిచిపెట్టేసి పిల్లలు తమకి తామే రాయడం నేర్చుకున్నారు. ఇప్పుడు పిల్లలు అక్షర శబ్దాలను నేర్చుకోవడానికి సిద్ధంగా ఉన్నారు. రోజు తరువాత రోజు మరియా వారికి అక్షరం చూపిస్తూ పేరు చెప్తూ, చూపిస్తూ పేరు చెప్తూ “ఇది ‘ఐ’ “ ఇది ‘ఓ’” అంటూ అదే పనిగా నేర్పింది. తుదకు పిల్లలు సబ్దాన్ని బట్టి అక్షరం గుర్తించగలిగారు. “చూడడం చదవడం అవుతుంది; ముట్టుకోవడం రాయడం అవుతుంది” అని మరియా తన అసాధారణ పద్ధతి గురించి రాసింది. కొంత మంది పిల్లలు ఎంత అభివృద్ధి చూపారంటే మరియా వారిని ఒక పబ్లిక్ స్కూలుకి, మిగతా సాధారణ పిల్లలతో పాటు చదవడంలో, రాయడంలో పరీక్ష తీసుకోవడానికి తీసుకు వెళ్లింది.

వారు పరీక్షలో ఉట్టెర్ణులయ్యారు. మరియాకి తన పద్ధతులు పని చేస్తాయని తెలుసు, మరి ఇప్పుడు తాను అది నిరూపించింది.

కానీ మరియా ఇంకా పూర్తి సంతృప్తి చెందలేదు. ఇవే బోధన పద్ధతులు మానసిక ఎదుగుదల లేని పిల్లలకు కాక సాధారణ పిల్లల బోధనలో వాడితే ఏమవుతుందా అని ఆలోచించకుండా ఉండలేకపోయింది. మానసిక ఎదుగుదల లేని పిల్లలే ఇంత అభివృద్ధి చూపిస్తే, ఇక సాధారణ పిల్లలు ఏం చేస్తారో?

సాంప్రదాయ పద్ధతులు వాడి నేర్పించే పిల్లలకంటే వీరు తొందరగా నేర్చుకుంటారు? ఆలోచించడానికి మరియాకి ఎదో కొత్త విషయం దొరికింది.

# 4

# సాధారణమైన పాఠశాల కాదు

పాఠశాలలో విజయం సాధించినప్పటికీ, అనుకోకుండా మరియా 1901లో తన ఉద్యోగాన్ని వదిలేసింది. తన స్నేహితులు అయోమయం పాలయ్యారు. తను పిల్లలతో అంత అభివృద్ధి సాధిస్తోంది. ఇప్పుడెందుకు వదిలేస్తుంది? అని ఆశ్చర్యపోయారు.

కానీ మరియా ఏమి సంజాయిషీ ఇవ్వబోదు. బహుశా జిసిప్పితో తన సంబంధం ముగిసిపోయి, అతను వేరొకరిని పెళ్లి చేసుకోవడం వల్ల ఆమె ఉద్యోగం వదిలేసిందేమో.

కారణాలు ఏమైనా, మరియా జిసిప్పీనూ, పాఠశాలనూ గతంలో వదిలేసి, భవిష్యత్తు వైపు సాగింది. ఇక్కడి నుంచి తను ఎక్కడికి వెళ్ళాలి? తాను పాఠశాలలో చేసిన పనిని గురించి చాలా ఆలోచించింది. తను, పిల్లలు ఎంత తొందరగా, ఎంత ఎక్కువ నేర్చుకున్నారో అని అబ్బుర పడింది. కానీ, ఇదే పద్ధతులు సాధారణ పిల్లల బోధనకు ఉపయోగిస్తే ఏమవుతుందా అని, తను ఆలోచించకుండా ఉండలేకపోయింది.

మరోసారి మరియా ఆసక్తి తనని కొత్త దిశలో నడిపింది. వైద్య కళాశాల నుంచి ఉత్తీర్ణురాలైన అయిదు సంవత్సరాల కాలంలో మరియా, ప్రత్యేక అవసరాలున్న పిల్లల విద్యపై పేరుమోసిన నిపుణురాలయిపోయింది.

కానీ తనకు ఇప్పుడు సాధారణ పిల్లల విద్య గురించి మరింత తెలుసుకోవాలనిపించింది. "కొంచెం కొంచెం గా నాకు, ఇవే పద్ధతులు సాధారణ పిల్లలకై ఉపయోగిస్తే వారు వృద్ధి చెందుతారని లేదా వారి వ్యక్తిత్వం ఊహించని విధంగా బయటకు వస్తుందని నాకు నమ్మకం కుదిరింది" అని మరియా తర్వాత చెప్పింది.

ఇప్పుడు ముప్పై ఏళ్ల మరియా రోమ్ విశ్వవిద్యాలయానికి తిరిగి వచ్చింది. తను పిల్లలు ఎలా చదువుకుంటారు తెలుసుకోవడానికి తనకు సహాయ పడగలిగే - ఫిలాసఫీ (తత్వ శాస్త్రం), సైకాలజీ (మనో విజ్ఞాన శాస్త్రం) మరియు ఆంథ్రోపాలజీ (మానవ శాస్త్రం), వీటితో పాటు బోధన, పరిశుభ్రత గురించి కోర్సులు తీసుకుంది. తాను ప్రత్యేక విద్య రంగంలో ఇతర నిపుణుల యొక్క పనిని గురించి అభ్యసించింది. తను ఉపాధ్యాయులనూ, పిల్లలనూ గమనించటానికి ప్రాథమిక పాఠశాలలను కూడా సందర్శించింది. తాను చదువుకున్నప్పుడు రోజులకూ, ఇప్పటికీ ఎంత స్వల్ప మార్పు వచ్చిందో చూసి తను ఆశ్చర్యపోయింది. పిల్లలు ఏక కంఠంతో ఇంకా పాఠాలు వల్లె వేస్తున్నారు. అవే చక్కటి వరుసలలో, నిటారుగా, సూది మీద అమర్చిన సీతాకోక చిలుకలలా కూర్చుని ఉన్నారు. వారి మధ్యలో తను కూడా కూర్చుని ఉన్నట్టు, దాదాపు తనను తాను చూసుకుంది.

1904వ సంవత్సరానికల్లా, మరియా అధ్యయనం మరియు పరిశీలనలు ఇటలీలో పాఠశాలలు మారాల్సిన సమయం వచ్చిందని మరియాకు విశ్వాసం కలిగించాయి. తను నేర్చుకున్న ప్రతీది, తనను ఎప్పటినుంచో తొలిచేస్తున్న ఒక ఆలోచనను దృఢపరిచినట్టయింది: పిల్లలను ఏది నేర్చుకోమని బలవంత పెట్టకూడదు.

వారికి నేర్చుకోవాలని  ఉంటుంది. సరైన వస్తువులు/సామగ్రి మరియు సరైన పరిసరాలు ఉంటే వారు నేర్చుకోవడం ఎంచుకుంటారు.

తను ఇంకా తన ఆఫీసు లోనూ మరియు రోమ్ లో పలు ఆస్పత్రులలోను వైద్యం అందించడం కొనసాగిస్తున్నప్పటికీ, మరియా ఇటలీలోని పాఠశాలలను తీర్చిదిద్దడానికి ప్రచారం మొదలుపెట్టడానికి సమయం చేసుకోగలిగింది. తన పరిశోధనను గురించి వ్యాసాలు మ్యాగజైన్లలో ప్రచురించింది. రోమ్ విశ్వవిద్యాలయంలో పాఠశాల ఉపాధ్యాయులకు ఒక కోర్సు బోధించేది. ఉపాధ్యాయుల వేదికలలో ఉపన్యసించేది.

మరియా నేర్పుగల ప్రసంగకర్త. తాను ఎన్నడూ చీటీలు చూడలేదు, కానీ, మనోహరంగా మరియు విశ్వాసముతో మాట్లాడి, ఒక మాటను నొక్కి వక్కాణించడానికి చేతులు ఊపేది లేదా పిడికిలి వొణికించేది. తను చమత్కారి, అంతకు మించి, ఒప్పించు నేర్పరి. తన శ్రోతలు తనని నమ్మేవారు.

మరియా విద్యను గురించి చదవడం, రాయడం మరియు మాట్లాడటం చాలా ఆనందించేది. కానీ అన్నిటికంటే మించి తను పిల్లలతో పని చేయాలనుకునేది. కేవలం పిల్లలతో పని చేయడం ద్వారానే తను నిజంగా రైట్ అవునా కాదా అనేది తెలుసుకోగలనని మరియాకి తెలుసు.

1906లో తన అవకాశం వచ్చింది. ఆ ఏడాది, ఒక సంపన్నులైన బ్యాంకర్ల గుంపు, మరియా దగ్గరికి ఒక ఆసక్తిగొలిపే ప్రతిపాదనతో వచ్చారు. వారు, నగరంలోని బీద మరియు నిరాశ్రయులకు చవకగా ఇళ్ళు కల్పించడానికి, కొత్తగా తీర్చిదిద్దిన ఒక పాత అపార్టుమెంటు భవనం గురించి తనకు చెప్పారు. ఆ అద్దె భవనం రోమ్ లోని సాన్ లారెంజో లో ఉంది.

ఆ ప్రాంతం పేదరికానికి, మురికి వాడలకి పేరుమోసింది. అందులో అద్దెకు ఉండే వారిలో చాలా మంది చిన్న పిల్లలు కలిగి ఉన్న, ఉద్యోగం చేసుకునే పేద తల్లితండ్రులు. ఆ పిల్లలలో పాఠశాలకు వెళ్లే వయసు రాణి వారు, తల్లితండ్రులు ఉద్యోగానికి వెళ్లిన సమయంలో ఇంట్లోనే ఒంటరిగా వదిలేయబడేవారు. వారిని పర్యవేక్షించేవారు లేక, ఆ పిల్లలు బిల్డింగ్ అంతా పరిగెత్తి ఆడుకునే స్వేచ్ఛ ఉండేది. వారు కొత్తగా రంగులు వేసిన గోడల మీద పిచ్చి గీతలు గీసి, హాళ్ల చుట్టూ చెత్త జిమ్మేవారు.

ఆ భవంతిని పాడు చేయకుండా ఉండేందుకు ఆ బ్యాంకర్లు పిల్లలకు రోజంతా గడపడానికి ఒక గది ఇవ్వాలని నిశ్చయించుకున్నారు. కానీ పిల్లలకు వ్యాపకం కలిగించడానికి, వారిని ఆకతాయి పనులనుంచి దూరంగా ఉంచడానికి, బ్యాంకర్లకు ఎవరైనా ఒకరు కావలసి వచ్చింది. వారు మరియా పని గురించి విని ఉన్నారు. తనైతే ఈ పనికి సరైన వ్యక్తి కాగలదని అనుకుని తన కోసం వెతుక్కుంటూ వచ్చారు.

సరిగ్గా అటువంటి సవాలు కోసమే మరియా ఎదురు చూస్తూ ఉంది. తను ఆ ఉద్యోగం ఒక షరతుపై తీసుకుంటుంది. పిల్లల గది ఎలా నడపాలన్న దాని మీద తనకి సర్వహక్కులూ కావాలి. బ్యాంకర్లు ఒప్పుకున్నారు.

మరియా తన చిన్న పాఠశాల పేరు 'కాసా డి బాంబిని' అంటే 'చిన్నపిల్లల ఇల్లు' అని పెట్ట నిశ్చయించింది. జనవరి 6, 1907లో 'కాసా డి బాంబిని' ద్వారాలు తెరుచుకున్నాయి. మరియాకి తన జీవన వృత్తి అప్పుడే మొదలవుతున్నట్టుగా అనిపించింది. తను తర్వాత కాలంలో, ఆ పని ఎంతో ముఖ్యమైనదిగా నిరూపించబడబోతున్నదన్నట్టు తనకు ఒక 'ఊహ జ్ఞానం (విజన్) కలిగినట్టు జ్ఞాపకం తెచుకోబోతుంది.

తన పాఠశాల అధికారికంగా తెరుచుకున్నప్పుడు ఇచ్చిన ప్రసంగంలో, ఏదో ఒక రోజు ప్రపంచ నలుమూలల నుంచి తన పాఠశాలను సందర్శించడానికి ప్రజలు వస్తారని భవిష్యత్తు చెప్పింది. కేవలం మరియా మోంటెస్సోరి లాంటి ఆత్మ విస్వాసం ఉన్న స్త్రీ మాత్రమే ఆ ఖాళీగా ఉన్న ఒక్క గదిని, ఆ యాభై మంది పద్ధతిలేని పిల్లలనూ చూసి, ఎంతో ఆశతో నిండిఉన్న భవిష్యత్తును ఊహించగలిగి ఉండేది.

మరియా రోజులో ప్రతి గంటా తన 'కాసా డి బాంబిని' లోనే గడపాలనుకునేది. కానీ, కాసా నిర్దేశ కురాలేకాక మరియా ఇంకా డాక్టరు, ఉపాధ్యాయురాలు, అధ్యాపకురాలు మరియు పరిశోధనావేత్త. తను ఏదో పరిశోధనలు చేయడానికీ, గమనించడానికీ సమయం దొరికేందుకు, బ్యాంకర్ల అనుమతితో, తరగతి గది యొక్క బాధ్యతలు చేపట్టడానికి ఒక ఉపాధ్యాయురాలిని నియమించింది. తక్షణమే తను రూపొందించిన కొన్ని బోధనా సామగ్రి తీసుకువచ్చింది. మరియా వాటిని 'స్పర్శ నాత్మక/ఇంద్రియాత్మక (సెన్సరీ) వస్తువులుగా పేర్కొంది, ఎందుకంటే అవి పిల్లల స్పర్శ జ్ఞానాన్ని పదును పెట్టడానికి సహాయ పడగలవని తను నమ్మింది. ఆ వస్తువులలో కొన్ని కొత్తవీ, మరికొన్ని ఇదివరలో మానసిక ఎదుగుదల లేని మరియు మనసు చెదిరిన పిల్లల కోసం వాడిన వాటిని మార్చి మెరుగులు దిద్దిన సామగ్రి. మరియా పిల్లలకు వస్తువులు ఇచ్చి తదుపరి వారిని వాటితో ఒంటరిగా వదిలెయ్యమని చెప్పినప్పుడు కాసా లో ఉపాధ్యాయురాలు బహుశా ఆశ్చర్యానికి గురయ్యి ఉంటుంది. "కేవలం పిల్లల స్పందన గమనిద్దామని" అని మరియా తరవాత వివరించింది "ఆమెను ఏ విధంగానూ వారి పనిలో జోక్యం చేసుకోవద్దని చెప్పాను. లేకపోతే నేను వారిని గమనించగలిగి ఉండేదాన్ని కాను".

పిల్లలు బొమ్మలనూ, బండ్లనూ పట్టించుకోకుండా సరాసరి సిలిండర్లు, క్యూబ్ లు, రాడ్లు మరియు తాను రూపొందించిన ఇతర వస్తువుల కోసం వెళ్తే మరియా ఎంతో మురిసిపోయింది. తను పిల్లలను గమనిస్తూ ఉన్నంతలో కొన్ని సార్లు గంటలు గడిచిపోయేవి. తను ఎప్పుడూ కొత్త వస్తువులు ఏవి వాడవచ్చు అని ఆలోచిస్తూ ఉండేది. తరచూ, తను ముందు రోజు రాత్రి కొత్తగా తయారు చేసిన ఏదో వస్తువుతో పాఠశాలకు వెళ్ళడానికి వేచి ఉండలేకపోయేది. పిల్లలు ఏ వస్తువుల పట్ల మొగ్గు చూపుతారో, ఇంకా వాటిని ఎలా ఉపయోగిస్తారో చూడడం ఇష్టపడేది. వారు తమంతట తామే సిలిండర్ ఆకారం ఎటువంటి ఆకారం ఉన్న చిల్లులో వేయాలో తెలుసుకున్నప్పుడు లేదా క్యూబ్ లను వాటి కొలత ప్రకారం ఎలా పేర్చితే పొడవాటి ఒంటి స్తంభం మేడ కట్టగలరో తెలుసుకున్నప్పుడు తను అబ్బుర పడేది. వారికి సర్కిళ్లు, చతుర్భుజాలు (స్క్వేర్) మరియు త్రిభుజాలు, ఒక బోర్డుపై ఉన్న సరిజోడులో అమర్చడం ఎలాగో చూపించడానికి ఉపాధ్యాయుల అవసరం లేదు.

మూడు, నాలుగేళ్ల పిల్లలు కూడా ఎంతో శ్రద్ధతో /కేంద్రీకరించిన దృష్టితో పని చేయడం, అదే పనిని పదేపదే చేయడం చూసి మరియా ఆశ్చర్యపోయింది. ఒక్కొక్క వయసులో పిల్లలు, కొన్ని విద్యలు చాలా సునాయాసంగా నేర్చుకోగలరని కూడా తను గమనించింది. ఆ వయసు దాటితే పిల్లలకు అదే విద్య నేర్చుకోవడానికి ఎక్కువ సమయం పడుతుంది. నేర్చుకోవడానికి ఆ అంచెలను తను 'సున్నిత కాలం' గా పేర్కొంది. తాను గమనించిన కొద్దీ, పిల్లలు వారి వస్తువులను వారే ఎంచుకోవడం ఎంత ముఖ్యమో గ్రహించింది.

వారి 'సున్నిత కాలం' పట్ల వారికి సహజ జ్ఞానం ఉన్నట్టుంది. పిల్లలను గమనించడం వల్ల మరియాకి అర్ధమయిన విషయం, ఒక గ్రంథాలయం మొత్తం నిండి ఉన్న పుస్తకాలు, విశ్వవిద్యాలయంలో ఒక జీవితకాల సమయం ఎప్పటికీ నేర్పలేకపోయి ఉండేవి.

మరియా పాఠశాలలో ప్రతిరోజు ఉండలేకపోయేది కానీ, తన బిజీ షెడ్యూల్ ఎంత తరచుగా పరిమితిస్తే అంత తరచుగా వచ్చేది. కాసా లోని చిన్న పిల్లలకు మరియా రాక ఎంతో సంతోషం కలిగించేది. తను ద్వారం లోపలకి వస్తూనే, తనని పలకరించడానికి వారు పరుగెత్తేవారు. వారికి ప్రశాంతమైన చిరునవ్వు ఉన్న ఈ బొద్దు మహిళ అంటే ఇష్టం. ఇప్పుడు ముప్పైలు దాటిపోతున్న మరియా, ఎంతో స్టైల్ గా ఉన్న ముదురు రంగు బట్టలు వేసుకుని, తన ముదర బూదా రంగు జుట్టు చక్కగా తలపై సవిరించేది. తను పిల్లలను అంత దగ్గరగా గమనించడం గురించి వారు ఎప్పుడు పెద్దగా పట్టించుకోలేదు.

మరియా వారితో మాట్లాడడానికి లేదా ఒక ప్రశ్న అడగడానికి సంచరిస్తుంటే వారికి ఇష్టంగా ఉండేది. తను వారికి, వారు ఎంతో ముఖ్యమైన వాళ్ళని భావన కలిగించేది, ఎందుకంటే తనకు ఎల్లప్పుడూ వారు చెప్పేదాన్ని పట్ల ఆసక్తి ఉండేది.

వారాలు గడిచిన కొద్దీ, మరియా 'కాసా డి బాంబిని'కి మార్పులు చేయడం కొనసాగించింది. తను, తేలికగా పిల్లలు తమంతట తామే జరుపుకోగల మరియు పిల్లల పరిమాణం/కొలతలు గల కుర్చీలు, బల్లలు రూపొందించింది. పిల్లలు, వారిని వారు శుభ్రపరచుకోవడానికి చిన్న సింకులు పెట్టించింది. తాళాలు వేసిన బీరువాలు తీసేసి, వాటి బదులు పిల్లలకు అందుకోవడానికి వీలుగా ఉండేంత పొట్టి, తెరచి ఉన్న అరలు పెట్టించింది.

దాదాపు 'కాసా డి బాంబిని' లో ప్రతీ విషయం, కాసా ని ఇతర పాఠశాలల నుంచి వేరుగా నిలిపింది. ఎండ నిండిన కిటికీ గుమ్మం మీద మొక్కల, పూల వరుసలు ఉండేవి. బల్లలపై ఇప్పుడు కుందేలు పంజరాలు, చేపల గిన్నెలు ఉన్నాయి. పిల్లల గది చుట్టూ స్వేచ్ఛగా తిరుగుతూ, వారికి ఆసక్తి కలిగించే ఏ వస్తువునైనా ఎంచుకునేవారు. వారు, వారికి తోచినంత సేపు వారి పని చేసుకుని, తర్వాత వస్తువులను అరలలో వాటి నియమిత స్థలంలో పెట్టేసేవారు. ఎండగా ఉన్న రోజుల్లో, వారి ప్రాంగణంలో ఉన్న చిన్న తోటలో విత్తనాలు నాటే వారు లేదా కలుపు పీకే వారు. అన్నిటికన్నా గొప్ప విషయం, పిల్లలు చదువుకోవడం మరియు సరదాగా గడపడం ఒకే సమయంలో చేసేవారు.

అతి పిన్న వయసు నుంచి అతి పెద్ద వయసు పిల్లలదాకా, ప్రతి ఒకరికి పనులు కేటాయించి ఉండేవి. మొక్కల, జంతువుల సంరక్షణ, సొంత  భోజనం తయారు చేసి వడ్డించడం మరియు తరగతి గది శుభ్ర పరచడం వంటివి వారికి నేర్పబడేవి. మరియా ఈ ఇంటి పనులను 'జీవిత ఆచరణాత్మక అభ్యాసాలు' అని పిలిచేది. పిల్లలకు వారి పనులు వారు చేసుకోవడం చిన్న వయసులోనే నేర్పాలని ఆమె నమ్మేది.  స్వతంత్రత ఉంటే తప్ప, ఎవరూ స్వేచ్ఛగా ఉండలేరు" అని ఆమె తరచూ అనేది. ఆ పిల్లలకు, స్వతంత్రతకు మరియా మోంటెస్సోరి కంటే మంచి ఆదర్శం ఎవరు అయి ఉండేవారు!

కొన్ని సార్లు పిల్లల్ని గమనిస్తూ ఉండగా మరియాకు తన కాసా, తనను చిన్నతనంలో ఎక్కడైతే రోజంతా కూచోబెట్టేవారో, ఆ చిన్న చీకటి, నీరసం కలిగించే పాఠశాల గది కంటే ఎంత తేడాగా ఉంది అన్న ఆలోచన వచ్చేది.  ఈ పిల్లలు పంజరంలో చిలకల్లా చతుర్భుజుల గురించీ, త్రిభుజుల గురించీ నిబంధనలు వల్లే

వేయట్లేదు. వారు ఆ ఆకారాల్ని పట్టుకుని, వాటి అంచులను/పక్కలను లేఖ పెట్టి, వాటి కోణాల్ని స్పర్శిస్తున్నారు.

మరియా తన పాఠశాల పురోగమించిన విధానంతో చాలా మురిసిపోయింది. తను పిల్లలను అల్లరిగా పరుగులు తీయడం నుంచి ఆపడం కంటే చాలా ఎక్కువ చేసింది. ఆ భవనం యజమానులు సంతోషం కూడా అది స్పష్టం చేసింది. వారు మరియాను మరొక అద్దె వసతితో కూడా ఒక పాఠశాల ఏర్పాటు చేయాలని కోరారు. ఏప్రిల్ 7, 1907న, మొదటి కాసా పాఠశాల తెరిచిన కేవలం మూడు నెలల తర్వాత, రెండో 'కాసా డి బాంబిని' సాన్ లోరెంజోలో తెరవబడింది.

ఆ శరదృతువులో మరియా మరొక ప్రయోగాన్ని చేయ నిశ్చయించుకుంది. ఆ రోజుల్లో పిల్లలకు ఆరు సంవత్సరాలు వచ్చే వరకు రాయడం, చదవడం ఎన్నడూ నేర్పి ఎరుగరు. ప్రీ-స్కూల్ (ఆరు సంవత్సరాల లోపు పిల్లల పాఠశాల) పిల్లలకు ఎటువంటి నైపుణ్యం చూపడానికి చాలా చిన్న వారని చాలా మంది నమ్మేవారు. మరియా దానితో ఖచ్చితంగా ఏకీభవించి నట్టుగా అనుకోలేదు. తన శరణాలయాల్లో పిల్లలకు రాయడం నేర్పించడానికి ప్రత్యేక పద్ధతులు వాడింది. బహుశా తన ప్రీ-స్కూల్ విద్యార్థులు ఆ పద్ధతులకు దగ్గరగా ఉండే పద్ధతుల ద్వారా నేర్చుకోగలరేమో.

మధ్యాహ్నం మూడు దాటాక, పిల్లలందరూ ఇళ్లకు వెళ్లిపోయాక, మరియా మరియు తన అసిస్టెంట్ ఒక ఖాళీ తరగతి గదిలో గుమిగూడేవారు. ఆ చిన్న కుర్చీల్లో వారి పొడవాటి లంగాలో కూర్చుని, అక్షరమాల అక్షరాలు అట్ట ముక్కల నుంచి, ఇసుక అట్ల నుంచి కత్తిరించి, వాటి రెండిటినీ జిగురుతో అతికించేవారు.

మరియా ఆ అక్షరాలను ఒక పాత అట్టపెట్టెలో పెట్టి, ఆ పెట్టెను ఒక తరగతి గదిలో ఉంచింది. పిల్లలు వారి 'కొత్త బొమ్మల'ను అమితంగా ఇష్టపడ్డారు. పదేపదే వారు వాటిని పట్టుకున్నారు, దిద్దారు, తాకి అనుభూతిని పొందారు ఇంకా అక్షరాలను సమూహాలుగా పేర్చారు. తర్వాత పిల్లలు ఆ అక్షరం యొక్క శబ్దం చేయడం నేర్చుకున్నారు. వారాల తరబడి వారు అక్షర శబ్దాలు చేస్తూ, ఆ ఇసుక అట్ట అక్షరాలు వారి వేళ్ళతో దిద్దడం అభ్యసించారు.

ఒక అసాధారణంగా వెచ్చగా ఉన్న డిసెంబర్ రోజున, మరియా కప్పు పైన డాబా మీద పిల్లలతో పాటు బయట కూర్చుని ఉంది. ఒక అయిదేళ్ల బాలుడు తన పక్కన కూర్చున్నాడు. అతనికి చేయడానికి ఏమి పని లేదని అనిపిస్తుంది. మరియా అతనికి ఒక సుద్ద ముక్క ఇచ్చింది. "నాకు ఈ పొగ గొట్టం బొమ్మ ఒకటి వెయ్యి" అని అద్దె వసతి పొగ గొట్టం వైపు చూపిస్తూ అతనితో చెప్పింది.

ఆ చిన్న పిల్లాడు ఎంత బాగా బొమ్మ గీయగలడో ఆమెకు చూపించడానికి ఆత్రుత పడుతూ, ఆమె వైపు చూసి నవ్వాడు. అతను కొన్ని చిత్రాలు వేసి, తదుపరి మరియా వైపు చూసాడు. "నాకు రాయడం తెలుసు!" అని పేవ్మెంట్ మీద రాయడం మొదలు పెడుతూ, ఉత్సాహంగా ఆమెకు చెప్పాడు. మరియా ఒక్క ఉదుటున లేచి అతని వద్దకు పరుగెత్తింది. అవును, అతను రాస్తున్నాడు- అక్షరాలు మాత్రమే కాదు- మొత్తం పదాలు- 'మనో (చేయి), 'కమీనో' (పొగ గొట్టం), 'టెట్టో' (కప్పు)! గబగబా మిగతా పిల్లలు చుట్టూ చేరారు. "నాకు సుద్ద ముక్క ఇవ్వు. నేను కూడా రాయగలను" అని ఒకరు అన్నారు.

ఇంకా ఇంకా పిల్లలు పోగయిన కొద్దీ, ఉత్సాహం పెరిగింది. ఇక వారు ప్రతి చోటా రాసేస్తున్నారు- పేవ్మెంట్ పైన, కిటికీ తలుపుల పైన, తలుపులపైనా. మరియా ఆ రోజును 'రాయడం లోకి పేలడం' గా వర్ణించింది; ఆ రోజు నుంచి తాను వాడబోయే ఒక భావజాలం.

ఆ రాత్రి మరియా తన అట్ట పెట్టి మరియు కత్తెర మళ్ళీ బయటకు తీసింది. ఈ సారి 'బాంబోలా' (బొమ్మ), 'పల్లా' (బంతి), 'సెడియా' (కుర్చీ) అని చిన్న చిన్న నామ ఫలకాలు చేసింది. ఆ తర్వాత రోజు, కాసా లో ఇంచుమించు ప్రతి వస్తువుకూ నామ ఫలకం (లేబుల్) పెట్టింది. పిల్లలకు అక్షర శబ్దాలు అప్పటికే తెలుసు. ఆ శబ్దాలను అక్షరాలకు జోడించి, వారు ఆ రాసిన పదాన్ని వస్తువుకు పోల్చగలిగారు. వారు ఈ కొత్తగా కనుగొన్న విషయానికి ఎంత ఉత్సాహం పడ్డారంటే, వారు గది చుట్టూ పరుగులు తీస్తూ అన్ని నామ ఫలకాలను చదవడానికి ప్రయత్నించారు.

ఒక రోజు మరియా ఒక ఆట రూపొందించింది. పిల్లలు ఒక్కొక్కరుగా ఒక బుట్టలో నుంచి ఒక అట్ట ముక్క తియ్యాలి. వారు ఆ అట్ట మీద రాసున్న ఆట బొమ్మ పేరు గనక చదవగలిగితే, వారు దానితో వారికి కావాల్సినంత సేపు ఆడుకోవచ్చు. కానీ పిల్లలకు ఆట బొమ్మలతో ఆడుకోవాలని అనిపించలేదు. వారికి ఆ అట్ట ముక్కలు చదవాలని మాత్రమే అనిపించింది.

మరియా ఆ రోజు పొందిన సంతృప్తి ఎన్నటికీ మరువ బోదు. "నేను ఆ ఆతృతతో ఉన్న పిల్లల మధ్య

ధ్యానంలో నుంచుని, వారికి జ్ఞానం అంటే ప్రీతి అని, ఆ మతిలేని ఆట అంటే కాదని కనిపెట్టిన మీద, ఆశ్చర్యం నన్ను నింపేసింది.

ఆ మురికి వాడలలో నాలుగైదేళ్ల  వయసు పిల్లలు చదవడం, రాయడం నేర్చుకున్నారు. మరియా ఇక ఎన్నడూ మరో పని ఏమీ చేయకపోయినా, ప్రపంచం తనని ఆ ఒక్క విషయానికి జ్ఞాపకం ఉంచుకునేది. కానీ మరియా మోంటెస్సోరి అప్పుడే పని మొదలుపెట్టింది.

పేజీ 50:

# 5
# మాన్మో లీనా

సాన్ లోరెంజోలో జరుగుతున్న తన అసాధారణ ప్రయోగం గురించి వార్తా వ్యాప్తి చెందడం మొదలు పెట్టింది. మరియా పాఠశాలల్లో అద్భుతాలు జరుగుతున్నాయని పత్రికల వారు ప్రచురించారు. మొట్ట మొదటి కాసా తెరుచుకున్న ఏడాదిలోపే పత్రికా విలేఖర్లూ, ఉపాధ్యాయులు, సంఘ సంస్కర్తలు మరియు డాక్టర్లూ ఈ గజిబిజి అంత ఏమిటో వారికి వారే చూడటానికి వచ్చేవారు.

మరియా తన పాఠశాలకు వచ్చిన ఈ సందర్శకులను ఆహ్వానించింది. తాను వారితో తన పనిని గురించి మాట్లాడడం ఇష్టపడేది. తాను వారితో చెప్పిన విషయాన్ని వారు శంకించినా, తనకు అది వీసమెత్తు కూడా పట్టేది కాదు. తనకి, ఆ సందర్శకులు చేయాల్సిందల్లా పిల్లల్ని గమనించడం అని తెలుసు.

తన సందర్శకులు సాన్ లోరెంజోకి తలలు అనుమానంతో అడ్డంగా ఊపుతూ వచ్చి ఉండవచ్చు గానీ, వారు అంగీకారంతో తల పంకించి తిరిగి వెళ్లారు. డాటరెస్సా వాస్తవంగానే చాలా అసాధారణమైన పనులు చేస్తోంది.

ఒక రోజు పాఠశాలకు వచ్చిన ఒక సందర్శకుడు, ఒక చిన్న పిల్లాడు సుద్దతో బోర్డు మీద రాయడం గమనిస్తున్నాడు. అతను అంత చిన్న పిల్లాడి నేర్పు చూసి ఆశ్చర్య పోయాడు. అతను ఆ పిల్లాడిని "నీకు రాయడం ఎవరు నేర్పించారు?" అని అడిగాడు.

ఆ చిన్న పిల్లాడు ఏమి అర్థం కాని ముఖంతో తన పని నుంచి పైకి చూసాడు. "నాకు ఎవరు నేర్పించారా?" అని ఆ పిల్లాడు సమాధానం చెప్పాడు "నాకు ఎవరూ నేర్పలేదు. నేనే నేర్చుకున్నాను".

మరియా ఉప్పొంగిపోయింది. "మోంటెస్సోరి పద్ధతి యొక్క నిజమైన ఉపాధ్యాయులు పిల్లలు తామే" అని ఆమె ఎన్నో సార్లు వివరించింది. ఈ చిన్న పిల్లాడు తనకు కావలసినంత రుజువు.

పాఠశాలను సందర్శించడానికి వచ్చిన అధ్యాపకుల లో చాలా మంది, తామే మళ్ళీ తరచూ తిరిగి రావడం గమనించారు. ఈ మహిళలు ఎంతో కుతూహలంతో మరియా అక్కడ చేసే పని చూసి, కొత్త ఆలోచనలతో తిరిగి వెళ్లారు. కానీ వాళ్ళు తిరిగి రావడానికి వృత్తి కుతూహలం ఒక్కటే కారణం కాదు. వాళ్లకి మరియా కూడా ఇష్టం. తెలివైనదీ, ఎంతో ఆసక్తి ఉసిగొల్పేదేకాక, మరియా నులివెచ్చగా, ఓపికతో, తల్లిలా ఉండేది. తాను, వారిని ఒక కప్పు కాఫీ తాగుతూనో, ప్లేటు పాస్తాతింటూనో, వారి కష్టాల గురించి చెప్పుకోవడానికి ఆహ్వానించే అవకాశం ఎంత ఉందో, వారిని తరగతి గదిలో ఉపాధ్యాయుల యొక్క పాత్ర మీద ఉల్లాసవంతమైన చర్చలోకి దారితీయడానికి అంతే అవకాశం ఉంది.

మరియా తన జీవితంలో ఎన్నో సాధించింది కానీ, తనకి జీవితాంతం నిలిచిపోయే స్నేహబంధాలు ఏర్పరచుకునే తీరిక దొరకలేదు. ఇప్పుడు, 38 ఏళ్లకు, తనను చూడడానికి తరచూ వచ్చే మహిళల సహచర్యం ఆహ్వానించింది. తన పద్ధతులు నేర్చుకోవాలి అన్న వారి ఆత్రుత చూసి ఉబ్బిపోయేది. తాను వారికి ఉపాధ్యాయురాలు, సలహాదారు, స్నేహితురాలు మరియు తల్లి అయింది. వారు ఆమెను ఆప్యాయంగా 'మామ్మో లీనా', ఇటాలియన్ లో 'ప్రియమైన అమ్మ' అని పిలిచేవారు.

వారిలో ఒక మహిళ ఆనా మాక్కరోని. రోమ్ విశ్వవిద్యాలయంలోని మరియా ఇచ్చిన ఒక ఉపన్యాసానికి ఆనా హాజరైంది. అప్పటికి తాను అధ్యాపకురాలు అవ్వడం గురించి ఇంకా ఏ నిర్ణయం తీసుకోలేదు. కానీ మరియా తనకు స్ఫూర్తి ఇచ్చింది. ఇప్పుడు తాను మరియా పాఠశాలకు తరచూ వస్తోంది. మరియాలో తాను ఒక అసాధారణమైన తెలివిగల ఉపాధ్యాయురాల్నే కాక, ఒక దయ మరియు నెమ్మదత్వం గల స్త్రీని చూసింది. ఆనా పాఠశాలలో మరింత ఎక్కువగా బాధ్యతలు చేపట్టి, తుదకు మరియాకు అసిస్టెంట్ అయిపోయింది. ఉత్సాహవంతంగా, కష్టపడి పనిచేసే ఆ యువతితో మరియా తన సమయోజీని కనుగొన్నది. ప్రతిరోజు, ఆ ఇద్దరూ, ఆఖరి పిల్ల/పిల్లవాడు ఇంటికి వెళ్ళిపోయి చాలా సమయం దాటిన తర్వాత కూడా పని చేసేవారు. ఆ తర్వాత ఆ రాత్రికి తాళం వేసి, మరియా తన తల్లిదండ్రులతో పాటు ఉండే అపార్ట్మెంట్ వైపు వారు సాగేవారు.

వెచ్చని మంట వద్ద కూర్చుని, గంటలు తరబడి పిల్లల గురించి, బోధన వస్తువుల గురించి, విద్య గురించి లేదా ముఖ్యమైన సాంఘిక విషయాల గురించి మాట్లాడుకునేవారు. మరియా తల్లి రెన్నిల్డె కి తన కూతురు పని పట్ల ఇంకా ఎంతో ఆసక్తి ఉండి, వారి సంభాషణలో పాలు పంచుకోవడం చాలా ఇష్టపడేది.

ఆనా సహాయంతో, మరియా తన పాఠశాలల్లో తక్కువ సమయం గడపగలిగి, తన పరిశోధనలను రికార్డు చేయడానికి, ఉపన్యాసాలు ఇవ్వడానికి ఎక్కువ సమయం వెచ్చించగలిగింది. మరియా ప్రసంగాలు విని చాలా మంది మరియా పద్ధతులు, పరికరాలు వాడి వారి సొంత పాఠశాలలు తెరవడానికి ఆసక్తి కనబరిచారు. 1908 శరదృతువులో మరియా మరి మూడు పాఠశాలలు తెరిచింది - రెండు రోమ్ లో, ఒకటి దాదాపు మూడు వందల మైళ్ళ దూరంలో ఉన్న మిలాన్ లో. సాన్ లోరెంజోలో పిల్లలు మొదటి కాసా ద్వారాలు ప్రవేశించిన రెండేళ్ల లోపే, మోంటెస్సోరి అన్న పేరు ఇటలీ అంతా తెలిసిపోయింది.

1909 వేసవి కాలంలో, మరియా చాలా కాలంగా చేయని పని ఒకటి చేసింది: తను సెలవు తీసుకుంది. తాను ఒక డబ్బున్న బారనెస్ యొక్క అందమైన బంగ్లాలో కొంతకాలం విశ్రాంతిగా గడపడానికి ఆహ్వానించబడింది. కానీ, మరియా తాను ఖాళీగా ఉండటంలో పెద్ద నేర్పరి కాదని త్వరలోనే గ్రహించింది. కొంత కాలంగా తన స్నేహితులు తన పద్దతులను గురించి రాయమని వేడుకుంటున్నారు. అంచేత, ఇక తనని బిజీగా ఉంచటానికి మరేమి లేక, మరియా కొండలు కనిపించే డాబాపై కూర్చొని రాయడం మొదలు పెట్టింది. ఒకసారి కలం కాగితం పైన పెట్టగానే పదాలు ఎంత తొందరగా దొర్లుకుంటూ వచ్చాయంటే, ఒక నెలలోపే తాను ఒక పుస్తకం పూర్తి చేసింది. 'ది మోంటెస్సోరి మెథడ్' అదే ఏడాది అచ్చయింది.

మూడేళ్లలోపే ఆ పుస్తకం ఇరవై కంటే ఎక్కువ భాషల్లోకి అనువదించబడింది. చివరకు మోంటెస్సోరి బోధన పద్ధతి ఇటలీ అంచులు దాటి పయనించింది.

తర్వాత మూడేళ్ళ సమయంలో మోంటెస్సోరి పద్ధతిపై అధికారికమైన పాఠశాలలు చైనా నుంచి ఆస్ట్రేలియా నుంచి కెనడా దాకా, ప్రపంచమంతటా తెరుచుకున్నాయి. 1911 వ సంవత్సరం చివరకు, ఇటలీ మరియు స్విట్జర్లాండ్ మోంటెస్సోరి వ్యవస్థని అన్ని పబ్లిక్ పాఠశాలలకు అనుసరించింది. అదే సంవత్సరం అమెరికాలోని టారిటౌన్ న్యూయార్కులో మొట్టమొదటి మోంటెస్సోరి పాఠశాల తెరుచుకుంది. రెండేళ్లు గడిచేసరికి, అమెరికాలో దాదాపు వంద మోంటెస్సోరి పాఠశాలలు వచ్చాయి.

అన్ని మోంటెస్సోరి పాఠశాలలు తెరుచుకోవడం చూసి మరియా ఎంతో ఆనందించింది. కానీ, తన పద్ధతులు, పరికరాలు సరిగ్గా ఉపయోగపరచలేరేమో అని ఆందోళన పడింది. మోంటెస్సోరి తరగతి గదులు, సాంప్రదాయ గదుల కంటే ఎంతో భిన్నంగా ఉండడంవల్ల ఉపాధ్యాయులకు ప్రత్యేక శిక్షణ కావాలని మరియా గ్రహించింది. గడిచిన కొన్నేళ్లలో, మరియా వైద్యవృత్తికి చాలా తక్కువ సమయం వెచ్చించింది. ఇప్పుడు, 40 ఎళ్లా వయసులో, ఇటలీలోని వైద్యుల జాబితా నుంచి తన పేరు తొలగించాలని నిర్ణయించుకుంది. తన సమయం మొత్తం ఉపాధ్యాయుల శిక్షణకి మరియు పాఠశాలల ప్రారంభానికి అంకితం చేసే వీలు కావాలనుకుంది.

ఆనా మరియు తనకు బధులైన ఇతర అనుచరుల సమూహం సహాయంతో మరియా తన మొట్టమొదటి విదేశీ ఉపాధ్యాయ శిక్షణ కోర్సు ప్రణాళిక రూపొందించడం మొదలు పెట్టింది.

పాపం, తన ప్రణాళికలకు, 1912 క్రిస్మస్ కు అయిదు రోజుల ముందు మరియా తల్లి మరణంతో, అంతరాయం కలిగింది. రెన్నిల్డె మోంటెస్సోరి మరియా యొక్క వీర అభిమాని, మద్దతుదారు, విస్వాస పాత్రురాలు మరియు స్నేహితురాలుగా ఉండేది. మరియా తరవాత చాలా ఎల్లా పాటు నల్ల దుస్తులు ధరించింది.

బిజీగా ఉండడం మరియాకి, తల్లి మరణం వల్ల కలిగిన తీవ్ర దుఃఖం నుంచి తేరుకోవడానికి సహాయపడింది. తను ఉపాధ్యాయ శిక్షణ కోర్సు ప్రణాళికతో ముందుకు సాగింది. ఆ కోర్సు రోమ్ లో జనవరి 1913లో తెరవబడింది. 87 మంది ఉపాధ్యాయులు ప్రపంచం నలుమూలల నుంచి వచ్చారు. మరియా, ఒక భాషానువాదం చేసే వ్యక్తితో పాటు, ఒక ఎత్తైన వేదికపై నుంచి, ఆ సమూహంతో మాట్లాడింది. తాను 42 ఏళ్ల మర్యాదస్తురాలైన స్త్రీ. అక్కడక్కడా తెల్లటి చారాలతో ఉన్న తన నొక్కుల జుట్టు, నున్నటి తన ముఖాన్ని మరియు మెరిసే తన బూదా రంగు కళ్ళను ఫ్రేమ్ చేసింది. తను ఇటాలియన్ లో జాగ్రత్తగా, ప్రతి వాక్యం తర్వాత తన పదాలు ఇటాలియన్ నుంచి ఇంగ్లీషులో అనువదింపబడడానికి సమయం కల్పించడం కోసం ఆగుతూ ప్రసంగించింది. తన స్నేహితులు గది చివర్న ఎంతో గర్వంతో వారి 'మెమ్మోలీనా'ను చూస్తూ కూర్చున్నారు. ఆ శిక్షణ కోర్సు మహా విజయవంతం అయింది.

ఆ ఉపాధ్యాయులు బోధన లోని కొత్త మార్గాలతో, వారు ఎంచుకున్న వృత్తి పట్ల సరికొత్త ఉత్తేజంతో సాయుధులై, ఇంటికి వెళ్లారు. మరియా, వారు వారి పాఠశాలలకు తిరిగి

తిరిగి వెళ్లి తన పద్ధతులను సక్రమంగా బోధిస్తారని తెలిసి ఎంతో తేలిక పడింది. తుదకు తన కొత్త రకం పాఠశాల విజన్ నిజమవడం చూస్తోంది.

కానీ, ఒక విషయం మరియా పూర్తిగా ఆనందం పొందడానికి అడ్డుగా నిలిచింది - తన కొడుకు మారియో అక్కడ లేకపోవడం. అతను పుట్టినప్పటి నుంచి పదిహేనేళ్ళు గడిచిపోయాయి. ఇటలీలో ఎన్నో విషయాలలో మార్పు వచ్చింది కానీ, ఒక విషయం మారలేదు. ఒక పెళ్లి కాని తల్లికి బిడ్డ పుట్టడం ఇంకా అప్రతిష్ఠ.

మారియోకి, మారియాని గురించిన నిజం ఎన్నడూ చెప్పకపోయినా, ఆమె ఒక ప్రత్యేకమైన వ్యక్తి అని అతనికి ఎప్పుడూ తెలుసు. 1913లో ఒక వెచ్చటి వసంతకాలపు రోజున, పాఠశాల విహార యాత్రలో ఉండగా, మారియో ఆ 'అందమైన స్త్రీ' అతనికి సమీపంలోనే తన కారులో నుంచి దిగుతూ ఉండడం చూశాడు. ఏళ్ల తర్వాత, అతను ఆమె దగ్గరికి వెళ్లి "నువ్వు నా తల్లివి అని నాకు తెలుసు" అని ఎలా చెప్పాడో, ఇంకా జ్ఞప్తికి తెచ్చుకోబోతాడు. అతను మరియాతో, తను ఆమెతో పాటు వెళ్లాలనుకున్నాడని చెప్పినప్పుడు ఆమె కాదనలేదు. ఆ రోజు నుంచి తల్లీ కొడుకులు ఎల్లప్పుడూ కలిసే ఉన్నారు. తను నలుగురిలోనూ అతను తన కొడుకేనని ఎన్నడూ చెప్పలేకపోయింది. కానీ, కనీసం అతన్ని తన దగ్గర ఉంచుకుంది.

తన మొదటి విదేశీ శిక్షణ కోర్సు విజయాన్ని అనుసరించి, మరియా ఉపాధ్యాయులకు శిక్షణ ఇస్తూ, ఉపన్యసిస్తూ మరియు ఉపాధ్యాయులకు కొత్త పాఠశాలలు స్థాపించడానికి సహాయం అందిస్తూ , ప్రపంచం మొత్తం ప్రయాణం చేసింది.

ఆమె ప్రయాణాలలో చాలా వరకు మారియో ఆమెతో వెళ్ళాడు. చివరకు అతను ఆమె సెక్రటరీ మరియు అసిస్టెంట్ అయ్యాడు. అతనికి పెళ్ళై, పిల్లలు పుట్టిన తర్వాత కూడా అతను  మరియా తో పని చేయడం కొనసాగించాడు. 1929లో వారు 'అసోసియేషన్ మోంటెస్సోరి ఇంటర్నేషనేల్'ని మోంటెస్సోరి పాఠశాలలపై తనిఖీ చేయడానికి మరియు ఉపాధ్యాయుల శిక్షణ పర్యవేక్షించడానికి స్థాపించారు.

మరియా తన శేష జీవితాన్ని తన పనికే అంకితం చేసింది. మొదటి 'కాసా డి బాంబిని' తెరిచి 40 ఏళ్ళు అయినా కూడా మరియా తన పద్ధతుల్ని ఇంకా అదే ఉత్సాహంతో, శక్తితో  బోధిస్తోంది. తన తర్వాత సంవత్సరాలలో కూడా తను, విమానంలో హాలండ్ నుంచి లండన్ కి వెళ్లి, భోజనం చేసి, తదుపరి విమానంలో ఇండియా కి ఉపన్యాసం ఇవ్వడానికి రావడం లాంటివన్నీ అదే రోజున చేయడం అసాధారణమేమి కాదు. కానీ మరియా ఎంత బిజీగా ఉన్నా సరే, ఆమె పిల్లల్ని సందర్శించడానికి ఎల్లప్పుడూ సమయం చేసుకునేది. ఆమె ఏదైనా కొత్త ఊరు చేరుకున్న వెంటనే, అతి దగ్గరలో ఉన్న మోంటెస్సోరి పాఠశాలకు తీసుకు వెళ్ళమని అడుగుతుండేది. పిల్లలు ఉత్సాహంగా కొత్త సందర్శకురాలి చుట్టూ గుమిగూడుతుంటే తాను అక్కడ ఓపికతో కూర్చుని ఉండేది.

"ఇది చూడు"

"నన్ను చూడు"

"నేను లెక్క పెట్టగలను"

"ఇది విను"

ఆ చిన్న పిల్లలు మరియాకి వారు ఏమి చేయగలరో చూపించడానికి ఎప్పుడూ ఆత్రుత చూపేవారు - మరియా అది చూడటానికి ఎప్పుడూ ఆత్రుత పడేది.

1949 కల్లా మరియా రెండు ప్రపంచ యుద్ధాల మధ్య బతికింది మరియు ఆమె ఎప్పటికి చెక్కు చెదరని విశ్వశాంతి గురించి తరచూ మాట్లాడేది. “మనము కేవలం, ఎంతో భిన్నంగా ఉన్న ఈ పెద్ద వారినందరినీ ఒక్కటిగా కలపటానికి ప్రయత్నించడం ద్వారా ప్రపంచ సామరస్యం సాధించలేము” అని ఆమె అంది. “కానీ మనము, జాతి బేధ భావాలకు అతీతమైన పిల్లలతో మొదలు పెడితే, అది సాధించవచ్చు”. చిన్న పిల్లల విద్య పట్ల ఆమె జీవితకాల నిబద్ధతకు, మరియా ‘నోబెల్ శాంతి బహుమతి’ కోసం 1949లో, 1950లో మరియు 1951లో నామినేట్ చేయబడింది. తనను ఈ గౌరవం ఎంతో కదిలించివేసింది.

మే 6, 1952 న హాలాండ్ లో స్నేహితులను సందర్శిస్తుండగా మరియా మరణించింది. తాను హాలాండ్లోనే సమాధి చేయబడింది. ఆమె ఎక్కడ మరణిస్తే అక్కడే సమాధి చేయమన్నది ఆమె కోరిక. ఈ క్రింది మాటలు ఇటలీలో ఆమె తల్లితండ్రుల సమాధి శిలాఫలకంపై రాసినవి : మరియా మోంటెస్సోరి - ”తన ప్రియమైన దేశం నుండి దూరంగా, ఇక్కడ సమాధి అయి ఉన్న తన ప్రియమైన వారి నుంచి దూరంగా, తన కోరిక మేరకు, తనను ప్రపంచ పౌరురాల్ని చేసిన తన పని యొక్క సార్వత్రికతకు (యూనివెర్సనాలిటీ) సాక్షిగా”.

తన వీలునామాలో మరియా తన సర్వసంపదలూ, తన ‘ఇల్ మయో ఫిగ్లియో’ - నా కొడుకుకు’ రాసింది. చివరికి చనిపోయిన తర్వాత, తను మారియోను తన కొడుకుగా పిలవగలిగింది. మరియా కోరిక మేరకు మారియో ‘“మానవ జాతి మంచి కోసం”, ఆమె ప్రారంభించిన పనిని కొనసాగించాడు.

మరియా ఆలోచనలు తనతో చావలేదు. అన్ని చోట్ల పాఠశాలలు, ఏదో ఒక విధంగా, తన పని వల్ల ప్రభావితం అయ్యాయి. ప్రపంచవ్యాప్తంగా వేలకొలది ఉన్న మోంటెస్సోరి పాఠశాలలు "ఊహ (విజన్)" ఉండి - దాన్ని సాధించిన ఆ స్త్రీ కి నివాళి.

*****

# కాసా డి బాంబిని లో ఒక సాధారణ రోజు

9:00 - 10:00 రాక, మరియు రోజు యొక్క తయారీ:
పరిశుభ్రతకు తనిఖీ, ఆప్రాన్ వేసుకోవడానికి సహాయం, ఆచరణాత్మక జీవితం యొక్క అభ్యాసాలు. ముందురోజు విషయాల గురించి చర్చ. ధార్మిక అభ్యాసాలు.

10:00 -11:00 మేధా సంబంధమైన అభ్యాసాలు (స్పర్శనాత్మక వస్తువులు వాడి) మరియు పేరులు నేర్పే పాఠాలు (వస్తువులను వర్ణించటానికి సరైన పదాలు నేర్చుకోవడం, 'పొడుగు' మరియు 'పొట్టి', 'మన్దమ్' మరియు 'పల్చన' వంటివి), మధ్యన చిన్న విశ్రాన్తి సమయాలతో

11:00-11:30 సునాయాసమైనవ్యాయామాలు:
సాధారణ కదలికలు ఎంతో మనోహరంగా చేయడం, వరుసలో నడవడం, మర్యాదలో పాఠాలు, వస్తువులను మనోహరంగా పెట్టడం

11:30 - 12: 00 చిన్న ప్రార్థన, మధ్యాహ్న భోజనం

12:00 - 1:00 నచ్చిన ఆటలు

1:00 - 2:00 దర్శకాత్మక ఆటలు, వీలైతే బయట. పెద్ద పిల్లలు ఆచరణాత్మక జీవితం యొక్క అభ్యాసాలు చేయడం. పరిశుభ్రత కోసం అందరిని పరీక్షించుట. చర్చ.

2:00 - 3:00 చేతితో చేసే పని : మట్టితో రూపాలు, రూపకల్పన వంటివి

3:00 - 4:00 వ్యాయామం మరియు పాటలు, వీలైతే బయట. మందు యోచన పెంపొందించడానికి అభ్యాసాలు : మొక్కల మరియు జంతువుల సంరక్షణ.

# గ్రంథ పట్టిక

1. క్రామర్, రీటా. మరియా మోంటెస్సోరి: ఒక జీవిత చరిత్ర. రీడింగ్, మసాచుసెట్స్: ఆడిసన్ - వెస్లీ, 1988.

2. మోంటెస్సోరి, మరియా. ది మోంటెస్సోరి మెథడ్. న్యూయార్క్: స్చోకెన్, 1964.

3. పోల్లర్డ్, మైఖేల్. మరియా మోంటెస్సోరి. హర్రిస్బర్గ్, పెన్సిల్వేనియా: మొరెహౌస్, 1990

4. స్టాండింగ్, ఈ. ఎం. మరియా మోంటెస్సోరి: హర్ లైఫ్ అండ్ వర్క్. న్యూయార్క్: న్యూ అమెరికన్ లైబ్రరీ, 1957

5. ఉల్ఫ్, అలీని డి. ఏ పేరెంట్స్' గైడ్ తో ది మోంటెస్సోరి క్లాస్రూమ్. అల్తూనా, పెన్సిల్వేనియా : పేరెంట్-చైల్డ్ ప్రెస్, 1980

రచయిత్రి బార్బరా ఓ' కన్నోర కి మరియా మోంటెస్సోరి పై ఆసక్తి, తన కొడుకు గ్రాడీ ని తన దుస్బ్యూరీ, మస్సాచుసెట్స్, ఇంటి వద్దనున్న మోంటెస్సోరి స్కూల్ లో వేసినప్పుడు కలిగింది. తాను డా. మోంటెస్సోరి గురించి చదవడం మొదలుపెట్టినప్పుడు, మిస్. ఓ' కన్నోర్, పిల్లలకు సమాచారం లేకపోవడం పట్ల ఆశ్చర్యం చెందింది. తను యువకుల కోసం మరియా మోంటెస్సోరి జీవిత కథ రాయ నిశ్చయించుకుంది. ఇది ఓ' కన్నోర్ యొక్క మొదటి పుస్తకం.

మోంటెస్సోరి పద్ధతి, చిత్రకారిణి సారా క్యాంపెటెల్లి కి కొత్తదేమీ కాదు. తాను ఇటలీలో పెరుగుతున్నప్పుడు, డా. మోంటెస్సోరి సూత్రాల మేరకు విద్యను అందించే పబ్లిక్ స్కూల్స్ లో చదివింది. తన తల్లితండ్రులు మోంటెస్సోరి పద్ధతిలో సర్టిఫికెట్ పొందిన బోధకులు. వారికి, మరియా కొడుకైన మారియో మోంటెస్సోరి ని కలిసే సౌభాగ్యం దక్కింది. మిస్. క్యాంపెటెల్లి అకాడెమియా డి బెల్లె ఆర్టి, ఫ్లోరెన్స్, ఇటలీ నుంచి, మరియు కోర్నెల్ యూనివర్సిటీ నుంచి డిగ్రీ లు సంపాదించుకుంది. ఇప్పుడు ఆమె ఆకృతి చిత్రలేఖనం మిన్నియాపోలిస్, మిన్నెసోటా లో బోధిస్తుంది.

